# అభ్యుదయ

మే 1979 ఒక రూపాయి



వీత్నాం వీరులకు తెలుగు జనం నీరాజనం

# విషయ సూచిక

సంచిక 5 : సంపుటి 3 మే 1979 సం॥ చందా రూ॥ 10/-

# పరిశ్రమల కీలక పాత్ర

దేశానికి నడిబొడ్డున ఉన్న ఆంధ్రప్రదేశ్‌కు ప్రకృతి అపరిమితమైన వనరులను ప్రసాదించింది. ఘనమైన ప్రాచీన వైభవం, ఆధునిక పారిశ్రామిక ప్రాతిపదికలు వున్న సర్వ సంస్కృతులకు ఆలవాలమైన రాజధానీ నగరాన్ని చరిత్ర ఆంధ్రప్రదేశ్‌కు సంక్రమింప జేసింది.

478 కోట్ల రూపాయల గణనీయమైన పెట్టుబడితో నెలకొంటున్న 260 భారీ మధ్య తరహా పరిశ్రమలు రాష్ట్ర పారిశ్రామిక స్వరూపాన్ని నవనవోన్మేషం చేస్తున్నాయి. పరిశ్రమలు నెలకొల్పుకోవడానికి అందుబాటులో ఉన్న ఆర్థిక సహాయ వినియోగం గత ఐదేళ్ళలో నాలుగు రెట్లు పెరిగింది. కాకినాడలో 282 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించదలచిన ఎరువుల ఫాక్టరీ 1981 లో ఉత్పత్తి ప్రారంభిస్తుంది. ఈ ఫాక్టరీకి రాష్ట్రపతి 1978 జులై 7 వ తేదీన శంకుస్థాపన చేశారు.

అభివృద్ధికి ప్రోత్సాహాన్నిచ్చే ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థ (ఎ పి ఐ డి సి) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ (ఎ పి ఎస్ ఎఫ్ సి) ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక ప్రాతిపదిక కల్పనా సంస్థ (ఎ పి ఐ ఐ సి) లాంటి సంస్థలు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల తులనాత్మక అభివృద్ధి కృషిలో కీలక పాత్ర వహిస్తున్నాయి.

[డి. జి. ఐ. అండ్ పి. ఆర్. 47]

# విస్తరణవాదం...ఇంకానీ...ఇకపైసాగదు

విప్లవాల పురిటిగడ్డ వియత్నాం. వీరులకు పోతుగడ్డ వియత్నాం. అలాంటి వియత్నాం మీద ఫిబ్రవరి 17 న చైనా పాలకులు జరిపిన మెరుపు దాడి ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచింది. సాహితీ సాంస్కృతిక జగత్తుకూ మానవతావాదులకూ ఎంతో ఆందోళన కల్గించింది. సానుభూతిచూపాలని వీరంతా సన్నద్ధమయ్యారు. ఈ మధ్యనే హెల్సింకిలో ప్రపంచ శాంతి సంఘం ఆధ్వర్యాన జరిగిన మహా సభయీ భావాలన్నీ ప్రతిబింబించింది. అనేక ప్రాంతాలనుంచీ, 80 అంతర్జాతీయ సంస్థల నుంచీ ప్రముఖులు పాల్గొని తమ మద్దతును చాటారు.

మూడు దశాబ్దాలుగా విరామమెరగని పోరాటంలో మునిగుంది వియత్నాం. సామ్రాజ్యవాదుల, వారి తొత్తులైన ఫ్రెంచి, జాపాన్, అమెరికన్‌లను రణరంగంలో తుదముట్టించిన వియత్నాం పైన తగుదునమ్మా అని పెద్దన్న ధోరణితో కయ్యానికి తలపడింది చైనా. బుద్ధి చెప్తామన్న చైనా-చివరకు వియత్నాం పోరాటాగ్నుల్లో శలభంగా మాడిపోయే దశకొచ్చి చావు తప్పి కన్నులొట్టబోయినట్లు ఏకపక్షంగా వెను దిరిగి పోయింది అమెరికా సామ్రాజ్య వాదం; నిప్పుల్లో జీడిగింజలను - చైనాచేత తీయించి గతంలో వియత్నాం చేతతిన్న చావుదెబ్బల పగ ఇలా తీర్చుకున్నా నన్న తృప్తితో చిందులేసింది. కాగా సోషలిస్టు కుటుంబం నుండి చైనా పూర్తిగా దూరమైంది. చైనా దేశంలో వెల్లువెత్తుతున్న "నూతన అమెరికా తరహా ప్రజాస్వామ్యం" మత్తులో జనాన్నిపడదోస్తే విప్లవ సంప్రదాయాలకూ-పోరాటదీక్షకూ జోలపాట పాడొచ్చని చైనా పాలక వర్గం తలచింది. అందుకే గిల్లికజ్జాలెట్టుకుంది వియత్నాంతో.

ఈ సంఘటన మన దేశంలోని రాష్ట్రంలోని కవులను, రచయితలను, కళాకారులను కదిల్చింది. వియత్నాం పట్ల సానుభూతిని అనేక ప్రదర్శనల-సభల-విరాళాల వసూళ్ళ-రూపాలలో ప్రదర్శించారు. ఉత్కళలోని ప్రముఖ రచయిత కాళిందీ చరణపాణి గ్రాహి, సాహిత్య అకాడమీ అధ్యక్షుడు డా॥సచికేతరాయ్; ప్రముఖ తమిళ రచయిత జయకాంతన్; రాజస్థాన్‌లోని ప్రఖ్యాత రచయిత్రి రాణిలక్ష్మి మురారి చూడవత్‌లు తమ సానుభూతి ప్రకటించారు. ఈ సందర్భంగా కలకత్తా మేధావులు చేపట్టిన

కార్యక్రమాలు గమనార్హం. సభలూ-సమావేశాలు జరిపారు. సంతకాలు సేకరించారు. వెయ్యి మంది బుద్ధిజీవులు చైనా పైతమనిరసనను వ్యక్తంచేశారు. 75కళాశాలలు; కలకత్తా, బర్ద్వాన్, జాదవ్‌పూర్, రవీంద్రభారతి, కళ్యాణివిశ్వవిద్యాలయాలలోపనిచేస్తున్న అధ్యాపకులు వీత్నాం పైతమ సానుభూతిని ప్రకటిస్తూ ప్రకటనలు చేశారు ఇలాగే 65 స్కూళ్ళ నుంచి అధ్యాపకులూ; లాయర్లూ, డాక్టర్లూ, మరో 40 మంది స్వాతంత్ర్య యోధులూ ఇలా మరో ప్రకటన పై సంతకాలుచేసి తమమద్దతును వీత్నాంకు అందించారు.

ఇక మన రాష్ట్రంలో పర్యటించ వచ్చిన వీత్నాం ప్రతినిధి వర్గాల సమావేశాలలో విశాఖలో మన రాష్ట్ర అరసం అధ్యక్ష వర్గ అధ్యక్షులూ, సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడూ కళాప్రపూర్ణ పురిపండా అప్పల స్వామిగారు పాల్గొన్నారు. విజయవాడ సభలో రాష్ట్ర అరసం అధ్యక్షవర్గసభ్యులు శ్రీతుమ్మల వెంకట్రామయ్యగారు, ఇతర ప్రదేశాల లోని సభల్లో యువ రచయితలూ కళాకారులూ పాల్గొని కవితలనుచదివి గీతాలు పాడి వీత్నాం వెన్నుతట్టారు. చైనా విస్తరణవాదభావానికి నిరసన తెల్పారు. వీత్నాం ప్రజల పోరాట పటిమకు తెలుగు నాట జనం నీరాజనం పట్టారు.

—oOo—

# రైతు పోరాట గీతాల సంకలనం

అఖిల భారత రైతు మహాసభలు జూన్‌లో విజయవాడలో జరగబోతున్నాయి. ఆ సందర్భంగా రైతు సమస్యలనూ - పోరాటాలనూ చిత్రించే కవితల సంకలనం తేవాలని కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం భావించింది. కవులను తమ పాటలను మే నెలాఖరులోగా పంపమని కోరుతోంది.

తుమ్మల వెంకట్రామయ్య
సంపాదకుడు.

కొత్తూరు శ్రీ రామ్మూర్తిరోడ్,
దుర్గా అగ్రహారం, విజయవాడ - 2.

# అభిమానులకు విజ్ఞప్తి

అభ్యుదయ అంతకంతకు సాహిత్యాభిమానుల ఆదరణకు పాత్రమౌతోంది. పత్రికను నిర్వహించటంలో రచయితలందరూ పరోక్షంగా తమ సహకారాన్నందిస్తున్నారనే అనచ్చు. అయితే ఇదే చాలదు. తెలుగు సాహిత్యాన్నీ, ప్రజా ఉద్యమాలనూ నూటికి నూరు పాళ్ళు ప్రతిబింబించే విధంగా దీన్ని రూపొందించాలి. కళా-సాహిత్య-సాంస్కృతిక రంగాలలో జీవనాడిగా అభ్యుదయ స్థిరపడాలి.

దీనికి రచయితలందరూ - వారే ప్రాంతం వారైనా సరే "అభ్యుదయ" విలేఖరులుగా భావించి వార్తలను సేకరించి పంపాలి. పత్రిక తీరుతెన్నులిప్పాటికే తెలిసిన రచయితలు తమ రచనలనూ-ఇతర సాహిత్యకారుల రచనలనూ పంపుతూ పత్రికస్థాయి పెరుగుదలలో భాగస్వాములు కావాలి.

ఆర్థికంగా స్తోమత పెరగనినాడు ఏ పత్రికా నిలబడలేదు. అందులోనూ సాహిత్య పత్రికైన అభ్యుదయ నిలదొక్కుకోటం ఎంతకష్టమో మీకు తెలియందికాదు. అనేక కొత్తశీర్షికలు పెట్టాలనీ-పేజీలు పెంచాలనీ-ఎంతో ఆకర్షణీయంగా తయారుచెయ్యాలనీ-దేశదేశాల తెలుగు పాఠకులకందించాలనీ ఎన్నో పథకాలూ-ఆలోచనలూ ఉన్నాయి. ఇవి కార్యరూపం దాల్చాలంటే ఆర్థికంగా అభ్యుదయను బలపర్చాలి. ప్రకటనలను సేకరించటంలోనూ-చందా దారులను చేర్పించటంలోనూ, గ్రంథాలయాలు తెప్పించేలా ప్రయత్నించటంలోనూ మీరందరూ కృషిచేస్తారన్న ఆశఉంది. సాహితీ-సాంస్కృతిక ఉద్యమాల ఊపిరితోనే అభ్యుదయ ఎదగగలదు. ఇందుకు మీ అందరి సహకారం కోసం అభ్యుదయ ఎదురుచూస్తోంది. దీనికి ప్రతిగా సాహితీ లోకానికి సేవ చెయ్యటమే తన కర్తవ్యంగా అభ్యుదయ భావిస్తోంది. ఇకనుండి అభ్యుదయ హైదరాబాదు నుంచే వస్తుంది.

విడిప్రతి: రు 1/- సం. చందా: రు. 10/

చెక్కులు-డ్రాఫ్టులు-M.O. లకు :

Y. VIJAYA KUMAR,
3-5-911/B1, Himayatnagar,
HYDERABAD - 500 029.

రచనలు తదితరాలకు :

YETUKURI PRASAD,
3-6-737/3, Himayathnagar,
HYDERABAD - 5000 29.

# ఇటుక బతుకు

ఆసు రాజేంద్ర

వాళ్ళు
కసితీర కాళ్లతో
నా గుండెలో గుచ్చుతుంటే
గిల గిలా తన్నుకొంటూ ఏడ్చాను
ఈ రాక్షసుల చేతిలో చావు తప్పదని.
నీ మట్టి బతుకును సరిచేశామన్నారు
నన్నొక ఆకారంగా రూపొందిస్తూ ...
సంతోషంతో సలాం చేసాను వాళ్ళకు.

ఎఱ్ఱని మంటల్లో
దోరగా వేపేస్తుంటే
గుండె పగిలేలా ఘోషించాను
నా బతుకును మసి చేస్తున్నారని.
నీ మేను రంగు మార్చేసామన్నారు
రక్తంలా మెరుస్తున్న నన్ను నాకు చూపిస్తూ ...
దేముళ్లంటూ మొక్కాను వాళ్ల పాదాలకు మురిసిపోతూ.
బళ్లమీద ఊరేగిస్తుంటే
స్వర్గంలో తేలిపోతున్నట్లు సంబరపడి పోయాను.

తిన్నగా
నా బతుకును
గోతిలోకి దింపుతుంటే
గొల్లు మనలేక
గుడ్లప్పగించి చూస్తుండి పోయాను
మనిషి చేసే మోసాన్ని
నాలాంటి వాళ్ల ఎంతోమంది ముందు నేను.

# భావాల జలాంతర్గాములు

పెమ్మరాజు గోపాలకృష్ణ

నా మనస్సముద్రంలో
ఎవళ్లకీ కనిపించకుండా
ఎప్పుడూ తిరుగాడుతూంటాయ్
భావాల జలాంతర్గాములు ....
నా మనస్సముద్రంలోంచి
తెరలు తెరలుగా పుట్టుకొస్తున్న
ఆనందపు అలల తాకిడి ....
దుడుకుగా దూకే కెరటాల
విరిగిన కలల అలజడి
జలాంతర్గాముల పరుగులకి సాధనాలు . . .

నా మనస్సముద్రంలోంచి
వేకువ సూర్యుళ్ల మంటల మాటల్నీ
చీకటి రాత్రుల్ల వెన్నెల పాటల్నీ —
మోసుకొస్తున్న జలాంతర్గాముల్ని
మీ దర్శనం కోసం —
కాగితాల వెన్నెల తీరాల మీద
కలాల లంగర్లతో
బంధిస్తాను !
రండి ! !

# హద్దులు

కథానిక

అల్లం రాజయ్య

బయట ఎండ నిప్పులు చెరుగుతోంది. లోపల బాగా ఉక్కగా ఉంది.. అప్పుడే ఫీల్డు మీదినుండి వచ్చి హేట్ తీసి ముందున్న టేబుల్ మీద గిరవాటేశాను. ఒళ్ళంతా హూనం అయిపోయింది. ఎడ్లబండిలో రెండుమైళ్ళగతుకులు రోడ్డుమీద ప్రయాణం నిజంగా చచ్చేంతపని. ఈ ఊరు నిండా జనం బతికేఉన్నరు. ఊరులో కోరమీసాలదొరలున్నారు. ఏటా ధాన్యం ఈ ఊరి నుండి తరలించ బడుతూనే ఉన్నది.......... పన్నులు కడుతూనే ఉన్నారు - ఇంతెందుకు ఈ గ్రామంనుండి దేశం అన్ని వసూలుచేస్తోంది. అయినా ఈ ఊరికి రోడ్డులేదు...అ మాటకొస్తే ఈ ఊళ్ళో ఏదీ ఉన్నట్టుగా కన్పించలేదు. "ఏదీ" అంటే ఐ మీన్ కరంటు వగైరా....

వెదవుద్యోగం- ఊళ్ళవెంట తిరగాలే- తిరగకుంటే ఏమైపోద్ది? కనిబండలు పీకేసి ఎంచక్కా! భూములన్ని కలిపేసి ఏదొరో తనపేరు పెట్టుకుంటడు. పట్వారి జనం దగ్గర శిస్తులు వసూలుచేస్తుంటడు. నేనొచ్చి కనిబండలు నిలబెట్టగలనా? నేను నిలబెట్టిన కనిబండలు ఎంత కాలముంటాయి. నేను గీచిన హద్దులు / అలాగే ఉంటాయా? పీక వేసేవాళ్ళు, పీకించు కునేవాళ్ళు ఉండగా.... పాతేవాడికేం విలువ? ఇవ్వాల్ల నేను పాతిన కనిబండ ఎవరి కోసం? దొరకోసం- దొర పొలానికి నీల్లు కావాలని ఆర్. డి. వో. స్పెషల్ తాఖీదు.

వాడుగూని, పొట్టిమీసాల మన్నెపోడు నేను ఒడ్డుమీద నిలబడితె చూచిన చూపు.... ముఖం మీద కాండ్రకించి ఉమ్మినట్టుగా ఉంది. మీరంతా తోడు దొంగలు అన్నట్టుగా ఉన్నది.

"నీ పేరేమిటోయ్...?"

"లింగన్న బాంచెన్...."

"ఈమాట..నూటనాలుగోనంబరు పొలం పుట్టిన దగ్గెర నుండి ఇందులో కాలువ ఏర్పాటున్నది. ఈ కాలువ నీటితో క్రింద యాభయి ఎకరాల భూమి పారాల్సి ఉన్నది."

"దరమ దొరలు.... తమరన్నది సచ్చమో? అవద్దమో నా కెరుకా బాంచెన్? నీబాంచెన్, మాకెరుకున్న

దొక్కటే- గది మీకెందుకు గని-నా పోరగండ్ల ముంగటి ఇక్క- గిదొక్కటే బాంచెన్. పెద్ద కాలువ ఎంత పొగడోలె తిస్క పోయినా నా అజ్జ తుమక అయిదు గుంటల పొలం ఒల్లకాల్వలకు కాలువ కింద పోతది బాంచెన్..."

"పోతే నన్నేం చేయుమంటావ్-- కాలువ లేకుండా యాభయెకరాలు."

"గీ గరిబోన్ని సూడుండ్రి బాంచెన్...."

ఆ తరువాత 'గరిబోన్ని' చూపు. ఒక వేపు తర్మ దొరలంటువే - వాడి కళ్ళలో దొంగలన్న భావం. నేను వాడ ఐదు గుంటల భూమి దొరతో వాని కిప్పించగలను... చట్ట ప్రకారం నష్ట పరిహారం చెల్లించాలి కూడా... కాని దొర చేసిన 'ఇంతెజాములు'- దొర కోసిన కోడి- దొరవింపిన గాజుగ్లాస్.... గుండెలో నిశామంట... నా సెక్సు వీక్ నెస్...

లింగం కళ్ళల్లోని సవాలు మంటను ఎదుర్కోవాలంటే ఇవ్వన్ని తప్పవి సరి.....

"తమరికి స్నానానికేర్పాట్లు చేయించేదా ?" పట్వారి డోర్ దగ్గర నిలబడి అడుగుతున్నాడు...

"ఛత్ అప్పికోటుకు..." నేను అనాలోచితంగా అన్నాను...

"ఎవరి మండ్లి" పట్వారి ఉలిక్కి పడ్డాడు....

"విన్న కాదులే...."

నాకు స్నానం చేయాలనిపించలేదు లింగని చూసే మనసులో-ఇంతి కుదుపుల బాపతు నొప్పులు, భరించరాని ఉక్క. మనసు నిండా చెత్త....నన్ను ఈ స్త్రీ వ్యామోహం వదులదు....నేను ఈ రోజు ఇక్కడ ఉండక తప్పదు.

"కాసేపాగు..." ఇంకా పట్వారి అక్కడే ఉన్నాడు....

నేను వెళ్ళిపొమ్మన్నట్లుగా సైగ చేశాను. పట్వారి వెళ్ళిపోయాడు.

కనులుమూసుకొని కుర్చీలో కూలబడ్డాను... ఎందరి భూములు దొరల పేర రాశాను..? ఫలితంగా ఎన్ని కానుకలు స్వీకరించాను ? ఇవ్వాళ్ల లింగడు నన్ను సవాలు చేస్తున్నాడు ... ఎంత సేపయ్యిందో అలా కూర్చొని...

బయట వేపచెట్టుమీద కాకులు అరుస్తున్నాయి. . . .

"దరమ దొరలు బాంచెన్...," ఎవరిదో స్త్రీ గొంతు వినిపించే సరికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను... సూర్యుడు అస్తమించినట్లుగా-ఉంది... దూరంగా బజారులో దుమ్ము రేపుతూ పశువుల మంద కన్పించింది...

నా ముందు నాముఖంలోకిచూస్తూ దాదాపు ఇరువై దాటిన స్త్రీ నిలబడియున్నది. కోలముఖం - గుండ్రటి కళ్ళు- కళ్ళల్లో వెదుకు....అటిటూ వెదుకుగా

చూస్తోంది. ఆవిడ గుండెలు గుండ్రంగా ఎత్తుగా ఉన్నాయి. ఎర్ర రంగు రవికె ఆమె గుండెలను దాచలేక పోతోంది. కట్టుకున్న చీర పాతదే ఆమె గుడ్డలు తీసేస్తే బావుంటుందేమో ? ఆవిడ చంకలో నారపేడులాంటి పిల్లో, పిల్ల వాడో ఉన్నాడు. . .

ఆమె హఠాత్తుగా క్రిందికి వంగి చంకలోని ఆమె కూతురో, కొడుకునో క్రిందినుంచి నాకళ్ళకు దూరంగా నేలను తాకి మొక్కింది.

"దరమ దొరలు బాంచెన్—మా పొరగండ్ల నోటికాడిబుక్కా తియకుండ్లి బాంచెన్ – గాయింత దొయ్యలుండగనే ఓ పూటతింటె మరోపూట మాడ్తన్నమ్. దొరకు ఏలెకరాల జమీనున్నది." ఇలాగా ఏదో చెప్పుకపోతోంది. కాని నాకు అవేవి విన్పించడం లేదు........ నా లోలోపల వాంఛ కదలుతోంది.

"మేమే మిచ్చుకోగలం బాంచెన్ గరీబోల్లం. . ."

నేను షాక్ తిన్నాను... నాసంగతి ఈవిడకెలా తెలుసు. . ." ఏమిచ్చుకుంటారు ? ఇవ్వడానికే వచ్చిందన్న మాట. కాని ఆర్.డి.వో.....దొర ఆర్. డి.వో. గొంతు పిసుకుతాడు. ఆర్. డి. వో. నా గొంతు పిసికేస్తడు. అంత దాకెందుకు దొర నన్ను ఈ ఊరి పొలిమేర దాటనిస్తాడా ? ఆ తరువాత దొంగ లీవు లెటరు... తరువాత కథమామూలే....

ఆమె చెప్పుకుపోతోంది. నేను బయట ముసురుకుంటున్న చీకటిని చూస్తున్నాను..... శిశువు నా కాళ్లవేపు పాకుతోంది.....

నేనుదృష్టి మరల్చుకొని ఆమెను పరిశీలనగా చూశాను....ఆమె సడెన్‌గా ఆగిపోయి శిశువును ఎత్తుకున్నది .... కళ్ళల్లో భయం. . .

"గరీబోల్లం తమరికేమివ్వగలం బాంచెన్. . ." మళ్ళీ అదేమాట. . . .

"ఏమివ్వాలను కున్నారు." పైకి అడుగలేదు. కాని ఆమె అర్థంచేసు కున్నది.

కాసేపు మౌనం. . . అతరువాత మళ్ళీ అటూ యిటూ చూసి అతి తగ్గు స్వరంతో

తమరు కావాలనుకుంటే... ఈడ కాదు. పట్వారత్తే దొక్కసింపి డోలు కడతాడు..." ఆమె అంటోంది...

భూమికోసం-ఆమె దేన్నైనాఇవ్వడానికి సిద్ధంగా ఉంది... భూమంటే వీళ్ళకు అంత ప్రేమా ? తనూ తీసుకునే పొజీషన్‌లో లేదు...

"గెటవుట్....వెళ్ళు... ఇక్కడ నుంచి వెళ్ళు..." నేను అరిచాను. నా అరుపు నాకే వింతగా తోచింది...

ఆ అరుపుకు లోపలి నుండి పట్వారి లాంతరుతో సహా పరుగెత్తుకొచ్చాడు.వచ్చినావిడను ఎగాదిగాలాంతరెత్తిచూసిండు.కనుబొమలు ముడిచిండు.

"లంజెకానా ఈడి కెందుకచ్చినవ్. . ." పట్వారి తిడుతున్నాడు. . . ఆమె వెళ్ళిపోతోంది-వెనక్కు తిరిగైనా చూడకుండా...

"ఏమన్న దుండ్లి..."

"తనకు భూమి కావాలన్నది."

"అనదు మరి... దానవ్వను... సంపాయించీదాయె.."

పట్వారి అకారణంగా నవ్వింది.

"ఇంకేమైన అన్నదా ?" పట్వారి రంధ్రాన్వేషణ.

"మీ ఉద్దేశమేమిటి?" ఉరిమి చూశాను...

అదికాదుండ్లి- మీరు సిరాతులున్నరు- ఇంతేజాములై పోయినట్టే-తానం సేస్తే బాగుంటదేమో?" నసిగింది...

"ముందు దొరను పిలిపించండి..." అన్నాను అఫీసర్ హోదాలో

"కచ్చీరు గదిల కూకున్నరు- తమరే.. "

నేను సరాసరి దొర ముందుకు నడిచాను...

దొర కాలుమీద కాలేసుకొని సిగరెట్టు తాగుతున్నాడు. కుర్చీలో కూర్చుండు మన్నట్లుగా చూసింది.

కూర్చున్నాను...మౌనం...

"కాలువ క్రింది భూమికి నష్టపరిహారం రూలు ప్రకారం యివ్వాల్సుంటుంది.."

" . . . . ."

నేను లేవబోయాను...

"కూరోండి. . ."దొరఅవులించింది...

"టైమెంత ?... తెల్లారి మాట్లాడుకుందాం... ఇంతెజాములు నచ్చకుంటే మొహమాట పడకుండ్లి. . . ఇయాల్ల పది తక్కువ కానియ్యి. . . పట్వారి అన్నీ రడీయేనా ? నిన్నబాగా నిద్రపట్టిందా?"

"తమరిదే ఆలిశ్యం..." పట్వారి నావేపు చూసి వెళ్ళిపోయాడు...

దొరచెప్పక పోతున్నాడు.అంతూ పొంతూ లేని మాటలు. దొరగట్టివాడే...గట్టివాడు కానిది దొరెట్ల అవుతాడు... దేశం గురించి మాట్లాడుతున్నాడు. ప్రజల గురించి మాట్లాడుతున్నాడు... మరేదో మాట్లాడుతున్నాడు...భూమి మాటతప్ప...

ఏయే సమయంలో ఎవరెవరు ఎదురు తిరిగారో చివరకు ఏమైపోయారో పరోక్షంగా చెప్పింది. తన కనుకూలంగా పని చేసిన వారు ఎట్లా బాగు పడిపోయారో వివరించింది. ఆ తరువాత మంత్రుల దగ్గరి నుండి అధికార్లదాకా తనబంధువులు, మిత్రులు వగైరా...వగైరా. .

"పొల్లగండ్లకు సుత తెలుసు వాళ్ళకేం గావాలో ? ఇన్నరా ! అవికి నట్టం కింద భూమిప్పిత్తరు. నేనిత్త... ఆడు మూన్నెల్లకు మల్లనాకే అమ్ముకుంటడు. కొనటో దుంటే అమ్మెటోనికి అవసరాలు అయే ఉంటాయి. లేకుంటే నేను పుట్టిత్త గిప్పుడు కొద్దిగొప్పల ఎల్లిపొయ్యేదివడ్డీకలుపాల్సివత్తది. సమఝుయితందా ? వానికొరగే దేమున్నది ? నేమునట్టపోయే దేమున్నది. మజ్జెల నట్టపోయేది నువ్వే! బాగాఇసారం

తేమతో? ఏ సంగతి నాకెరికలేంది కాదు. నేను తల్చుకోమగని.." దొర.

నా మూలంనిండా చెమటలు పట్టినయ్. ఆ రాత్రి నాకు జరగవలసిన మర్యాదలన్నీ జరిగినయ్. ఏమి కావాలను కున్నానో అది దొరికింది. రేపు కావాలను కున్నది "ఎర్ర రవికెది" కూడా ఇస్తనన్నది. కాని నేను తీసికోలేక పోయాను. ఇంకెవతనో నా మంచాల్లో పడేశాడు దొర. రంగు సీసాలు తాగాము,

కాయితం మీద గీకేసి తెల తెల వార కుండనే వెళ్ళిపోయాము.

తరువాత వర్షకాలంలో తెలిసింది.

నా కాయితం పనిచేయలేదట- అదివరకున్న అన్ని కాయితాల హక్కు- లకు కాలం చెల్లిపోయిందట- అన్ని కాయితాలనూ, దొర హక్కులను ఎవరో కాల్చేశారట - దొర కోర్టు భవనాల చుట్టూ తిరుగుతున్నరట నాకు నిజంగా గుండె ఆగిపోతుందను కున్నాను.

కాని నా భయానికి అర్థంలేదు, ప్రభుత్వం దొర హక్కులకోసం దొర పక్షాన గట్టిగా నిలబడ్డది....అక్కడ ప్రభుత్వం గట్టికావలా పెట్టింది. ఇప్పు డది కల్లోలిత ప్రాంతం....మళ్ళీ నేను హద్దులు నిర్ణయించాల్సి ఉంటుందేమో?

## విశ్వ జనాళికి వెలుగు

డి. సోమసుందర్

ప్రపంచ కార్మికులంతా ఒకటై
ప్రశాంత జీవన సాధనకోసం
ఫిరంగి గుళ్ళకు వెరవక నిలచి
బిరాన దూకిన దినమ్మిదేనోయ్!
పోరుకు నడిచిరి కార్మిక వీరులు
విప్లవ గీతాలాలాపిస్తూ!
బీటలు వారెను శత్రువు కోటలు
ఎగిరెను మింటను విజయకేతనం
వీధుల పారిన ధీరుల రక్తం
విశ్వ జనాళికి వెలుగై నిల్చెను.

# ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

(14 మార్చి 1979–18 ఏప్రిల్ 1955)

కాట్రగడ్డ గంగయ్య

జగద్విఖ్యాతి గాంచిన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ అత్యుత్తమ శ్రేణికి చెందినది విజ్ఞానశాస్త్రవేత్తగానే గాక, మానవతా వాదిగానూ, శాంతికాముకుడుగానూ ముఖ్యంగా మేధావులైన లోకులందరకూ చిరపరిచితుడు. భౌతిక ప్రపంచ స్థాయికి మూల భూతులైన వైజ్ఞానిక శాస్త్ర మర్మాలన్నిటినీ అవలోడనంచేసి, వైజ్ఞానిక రంగంలో మహా విప్లవం ప్రవేశ పెట్టిన మహనీయుడతడు. డెబ్బయిఅయిదు సంవత్సరాలక్రితం ఆయన కనిపెట్టిన సాపేక్ష సిద్ధాంతం యీనాడు సహితం అధ్యయన మొనర్చి, చర్చించని విజ్ఞాన శాస్త్రజ్ఞుడు లేడు. అందుకనే, కోపర్నికస్, గెలిలియో, న్యూటన్, డార్విన్ వంటి ఉద్దండులకోవలో శాశ్వతమైన స్థానం సంపాదించుకొన గల్గారాయన.

నిరాడంబరత, అడకువ, వినయం భూషణాలుగా గల ఐన్‌స్టీన్‌కు స్వీయ ప్రచారం అంటే గిట్టేదికాదు; తన పేరును, తన గొప్పదనాన్ని వెలుగులోకి తేవడమంటే యిష్టముండేది కాదు. అయితే ప్రపంచం కంట పడకుండా, ప్రజల కష్టసుఖాలను తెలుసుకోకుండా వారి బాధల్లో పాలుపంచుకోకుండా రమ్యహర్మ్యాల్లో సుఖలాలసుడై ఉండేవాడు కాడు. ప్రజల పోరాటాల్లో పాల్గొనడమే అతనికి సుఖమని తోచేది.

సైనిక తత్త్వం, సైనిక ప్రవృత్తి జర్మనీ అధికార వర్గంలో జీర్ణించి, పర దేశాలను కబళించడమే తమ ధ్యేయంగా పెట్టుకొన్న తరుణంలో జర్మనీలో పుట్టి పెరిగిన వాడు ఐన్‌స్టీన్. ఈ సైనిక తత్వానికి తలవంచనివాడాతడు. అంతే కాక, అతడు పట్టుదల గల శాంతికాముకుడుగా, నిరాయుధీకరణకు ప్రబలమైన ప్రచారకుడుగా పరిణతి చెందాడు. ప్రథమ ప్రపంచ సంగ్రామం ఆరంభమైన 1914 లోనే ఆయన విశిష్ట లక్షణాలు ప్రపంచానికి వెల్లడైనాయి. యుద్ధాన్ని బలపరుస్తూ 93 మంది జర్మన్ మేధావులు చేసిన ప్రకటనను ఎదిరించి యుద్ధ ప్రతికూల మహజరు పైన మరో యిద్దరితోపాటు ఆయన సంతకాలు చేశాడు దీనితో జర్మన్ నాజీల ఆగ్రహం ఆయనమీద కేంద్రీకృతమైంది. దీనికితోడు ఆయన యూదువంశంలో జన్మించడం ఆ జాతి దురహంకారులకు మరొక ఆగ్రహకారణమైంది.

హిట్లర్ దీనిని సహించలేకపోయాడు. జర్మన్ విజ్ఞాన శాస్త్రపరిషత్తు నుండి ఐన్‌స్టీన్‌ను 'ఎదో' మిష కల్పించి

బహిష్కరించ నిశ్చయించాడు. ఇతని మీద కన్నెర్ర చేసిన వాళ్ళెవరికీ ఇతని అసమాన మేధాశక్తి అంతు పట్టలేదు.

నా జీజానికి వ్యతిరేకత

1933 లో నాజీలు అధికారం హస్తగతం చేసుకొన్న సమయంలో ఐన్‌స్టీన్ అమెరికాలో ఉపన్యాసాల పర్యటనలో-నున్నాడు. తిరిగి రానిశ్చయించుకోలేదు. 1933 మార్చిలో అతడు ప్రకటించిన మానిఫెస్టోలో యిలా ఉద్ఘాటించాడు; "నా కోరికకు అనుగుణంగా, రాజకీయ స్వేచ్ఛ, సహనం, సమాన పౌరహక్కులు వాక్స్వాతంత్ర్యం లభ్యమైన దేశంలోనే నేను నా జీవితం వెళ్ళబుచ్చ దలచాను. ఇలాంటి సదవకాశాలు ప్రస్తుతం జర్మనీలో శూన్యమైనాయి. అంతర్జాతీయ అవగాహన, ప్రపంచశాంతిని కాంక్షించే మేధావులు, కళాకారులు, విజ్ఞానశాస్త్రవేత్తలు నేడు జర్మనీలో హింసింపబడుతున్నారు. కాని యీ కష్టదశ ఎల్లకాలం జర్మనీలో ఉండబోదు. ఆరోగ్యకరమైన మార్పులు త్వరలోనే అచ్చట మరల తలఎత్తగలవు. కాంట్ గోధేవంటి మహనీయులు, వారి బోధనలు, వారి మహత్కార్యాలు మరల మన్నన పొంది తీరుతాయి". బహిరంగంగా ఐన్‌స్టీన్ నాజీ జర్మనీని ఖండించడంతో ప్రపంచంలోని ఫాసిస్టు ప్రతికూలు రందరూ ఉత్సాహభరితులైనారు. ప్రఖ్యాతి చెందిన 'మార్క్ ట్వెయిన్ సొసైటీ' కి ఉపాధ్యక్షుడుగా ఐన్‌స్టీన్ పేరు సూచించబడినప్పుడు, ఆయన ఆ పదవిని నిరాకరించాడు. ఇలాంటి గౌరవాన్నే ఫాసిస్టు ముసోలినికి ఆ సంస్థ కట్టబెట్టదలచు కొన్న విషయం ఐన్‌స్టీన్ విని ఉండడమే అందుకు కారణం.

జర్మనీని వదలివెళ్ళినా, ఐన్‌స్టీన్‌ను హిట్లర్ మరచిపోలేదు; క్షమించ దలచలేదు. అతనిని పట్టుకొని తెచ్చిన వారికి 20 వేల మార్కులు బహుమతిగా హిట్లర్ ప్రకటించాడు. అతడు జర్మన్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి ఆయుధాలను, మందుగుండు సామానును దాచిపెట్టినాడనే నేరాన్ని సృష్టించి, ఐన్‌స్టీన్‌ను పట్టుకోవడానికి కటిక కసాయి వాళ్ళైన సైనికులను పోట్స్‌డామ్ నగరంలోని అతని యింటి మీదికి తోలాడు. ఎంత సోదాచేసినా, అతని యింట్లో రొట్టెలు కోసుకొనే తుప్పుపట్టిన కత్తి కంటె మరేమీ దొరకలేదు.

ఐన్‌స్టీన్ దేశభక్తిని, శాంతికాముకత్వాన్ని, మానవతను కీర్తించని మేధావులు, విజ్ఞాన శాస్త్రవేత్తలు, ప్రజాతంత్రవాదులు ఆనాడొక్కరు లేరు. ఉదాహరణలు కోకొల్లలు. ఆనాడు స్పెయిన్‌లో మానవతకు, ప్రజాతంత్రానికి ఊపిరిపోసి, చిరస్థాయిగా నిల్వడానికి యోధాగ్రణులైన లాపాషనారా వంటి యెందరో దేశభక్తుల నాయకత్వాన ఉవ్వెత్తుగా విజృంభించిన పోరాటాన్ని ఐన్‌స్టీన్ ఎంతగానో ప్రశంశించాడు. అలాగే పాషనారాగూడా ఆయన్ను కీర్తించింది.

ప్రజాతంత్ర వాదానికి, మానవతకూ కట్టుబడిన గోర్కీ ఐన్‌స్టీన్‌కు శ్లాఘాపాత్రుడైనాడు. రవీంద్రనాథ్ టాగూరు జర్మనీని దర్శించినప్పుడు ఐన్‌స్టీన్ అతనికి స్వాగతం పలికి అపారంగా గౌరవించాడు.

మారణాయుధాల ఉత్పత్తి గురించి రూజ్వెల్ట్‌కు లేఖ:

యూరప్‌లో దేశంతర్వాత దేశం హిట్లరుకు పాదాక్రాంతమవ్వడంపట్ల ఐన్‌స్టీన్ పరితపించి, హిట్లర్ చేతికిచిక్కిన న్యూక్లియర్ శక్తి మూలంగా ప్రపంచానికి రానున్న ఆపదను ఆనాడే గుర్తించి భేదపడ్డాడు. ఈ విషయమై అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్టుకు కూడా హెచ్చరిక చేశాడతను.

జపాన్ సైనిక బలం చిందరవందరైన సమయంలో హిరోషిమా మీద విసిరిన ఆటం బాంబు ఐన్‌స్టీన్ హృదయాన్ని దహింపజేసి, అతని ఖండన మండనలకు గురిఅయింది. అక్షణాన్నుంచి అతడు న్యూక్లియర్ ఆ యుధాలకు బద్ధశత్రువై, 1955 ఏప్రిల్ 18 తేదిన మరణించేవరకు ఆ శత్రుభావాన్ని వీడనేలేదు.

భారత్, చైనాలను ఐన్‌స్టీన్ గుర్తించడం మూలంగా సామ్రాజ్య వాదం, వలస విధానాల క్రింద మానవత నీచస్థితికి ఎలా దిగజారిందీ స్వాగంగా చూచాడు. మరణశయ్యనుండి కూడా 1955 లో బాండుంగ్‌లో జరిగిన ఆఫ్రో-ఆసియా మహాసభకు ఆయన అభినందన సందేశం పంపడం ద్వారా ఆయన సామ్రాజ్య వాద వ్యతిరేకతపట్ల అంతర్జాతీయ సమైక్యత పట్ల ఎలాంటి అభిమానమున్నదీ బోధ పడుతుంది. భారత స్వాతంత్ర్య పోరాట చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖింపదగిన మీరట్ కుట్రకేసు విందితులను బలపరుస్తూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని గర్హిస్తూ ఆయన దాదాపు 50 సంవత్సరాల క్రితం లేఖ వ్రాసారని మరువలేం.

ఫాసిస్టు ప్రతికూలుడూ, సిసలైన ప్రజాతంత్రవాదీ శాంతికాముకుడూ, అన్నింటినీ మించి విశ్వఖ్యాతినార్జించిన ఐన్‌స్టీన్ వంటి విజ్ఞాన ఖనికి జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ ప్రజల హృదయాల్లో శాశ్వత గౌరవస్థానం లభించడం సహజమే. అచ్చటి ప్రముఖ కవులు ఐన్‌స్టీన్ ఘనకీర్తిని ఉగ్గడిస్తూ ఎన్నో గేయాలు రచించారు. ఈ సంవత్సరం మార్చిలో జరిగిన, అతని శత జయంత్యుత్సవ నిర్వహణకై అచ్చట ఒక కమిటీ కూడా ఏర్పడ్డది, ఈ సంవత్సరంలో నిర్వహించబడ్డ కార్యక్రమావళిలో "ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ 1913-33 మధ్యగడపిన దినాలు" అనే అచ్చటి విజ్ఞాన శాస్త్ర పరిషత్తుచే తయారుచేయబడినవి జ్ఞానశాస్త్ర పత్రాలు గణనీయమైనవి. అంతవరకు ప్రచురింపబడని యీ పత్రాలలో కొన్ని అణిముత్యాలవంటివి. ఐన్‌స్టీన్ మానవతను, వ్యక్తిత్వాన్ని, మానవుడు మానవుడుగా బ్రతుక

గల నవసమాజ స్థాపనకై అతని ఆరాటాన్ని యివి వేనోళ్ళ చాటుతాయి

మన ప్రజల్లో ఐన్‌స్టన్ జీవిత విశేషాలను, ఆయన ఘనతను ప్రచురణల ద్వారా, సభలు, సమావేశాలద్వారా పరిచయం చేయడానికి అఖిలభారత శాంతి సౌహార్ద సంఘం, దేశములోని వివిధ మేధావుల సంస్థల యొక్క, సంఘాల యొక్క సహాయ సహకారాలను అర్థిస్తున్నది. ఆయుధీకరణపోటీతో వివిధ రాజ్యాలు పరుగులు తీస్తున్న యీ తరుణంలో మేధావుల యొక్క, సామాన్య ప్రజల యొక్క యీ ఐక్యకృషి ఎంతో ఉత్సాహం కల్గించి తత్ఫలితాల నియ్యగలదు. సార్వత్రిక నిరాయుధీకరణకై ఆనాడు ఐన్‌స్టీన్ యిచ్చిన పిలుపు యీనాటికీ సజీవమై ఉండడమేగాక, నానాటికి దాని విలువ ఇనుమడిస్తున్నది.

"మనం సృష్టించి, పెంచి పోషిస్తున్న విజ్ఞానం యొక్క పరమ ప్రయోజనం మానవజాతి క్షేమమే...మన సృజనాత్మక శక్తిమానవజాతికి శాశ్వతమైన మేలుకూర్చేదేగాని కీడుతలపెట్టేది గాదు. తోటి మానవులకై జీవించిన జీవితమే సార్థకమైనది" అన్న ఐన్‌స్టీన్ పిలుపు, తోడిమేధావులను, విజ్ఞానవేత్తలను మేలుకొలిపి కార్యదీక్షా పరులను చేసి తీరుతుంది.

# గోర్కీకి నివాళి

జర్మన్ మాతృక : బెర్టోల్ట్ బ్రెష్ట్

అనువాదం : జి. కాట్రగడ్డ

ఏడ్రదిస్తున్నా డిక్కడ
పూరి కొంపల రాయబారి !
ప్రజా పీడకులను బట్టబయలు చేసినవాడు
ఆ కీచకుల నెదిర్చిన యోధులను చిత్రించినవాడు
నడివీధులనే విశ్వవిద్యాలయాలుగా మార్చుకొన్నవాడు
నిరుపేద యింట బుట్టినవాడు
హెచ్చు తగ్గులు రూపుమాపడానికి అంకితమైన వాడు !
ప్రజలనుంచి పాఠాలు నేర్చుకొన్నవాడు
ప్రజలకే గురువైన అతడు !

(గోర్కీ మరణానంతరం వ్రాసిన పద్యం, ఆయన సమాధిపై వుండవలసిన మాటలుగా బ్రెష్ట్ ఈ పద్యాన్ని రాశాడు).

# ఆత్మసాక్షి

కథానిక

జాన్ గాల్స్వర్దీ

అను:
మహీధర రామ్మోహనరావు

టగ్గార్ట్ లేచి కూర్చున్నాడు. కొమ్మలు, రెమ్మలు మూసివున్న ఒక కోరడి పక్కన అతని మకాం. గత మూడు మాసాల ఈ మధ్య అతడు తన గడియారాన్ని, ఇతర వస్తువుల్నీ అమ్మేసుకున్నాడు. సన్నగా దిక్కులు తెల్లబడుతూండడాన్ని పట్టి మాత్రమే తెల్లవారబోతూందని గ్రహించేడు. పక్షులు తమ హృదయగీతాల నాలపిస్తున్నాయి. అది అతనికి సంతోషం కలిగించలేదు. వాని పాటలతో అతనికి పెందరాళే తెలివి వచ్చేసింది. ఇంక ఆకలి ప్రారంభమవుతుంది. పొద్దుట తినడానికి ఏమన్నా దొరుకుతుందనే ఆశ ఏంలేదు అయినా ఆ ఉదయగీతాన్ని ఆసక్తితోనే విన్నాడు. అతడు ఆరుబయట మకాం వేసినదిదే మొదటిరాత్రి.

టాగ్గార్ట్ పైప్ ముట్టించేడు. వెంటనే ప్రారంభమయింది. మళ్ళీ వుద్యోగం సంపాదించడం ఎల్లాగ అనే ఆలోచన ఉన్న వుద్యోగాన్ని ఎల్లా పోగొట్టుకొన్నాడో ఆలోచనలోకి ముసురుకుంది.

మూడునెలల క్రితం ఎంతో హుషారుగా, ఎంతో ధీమాగా "కంగ్లామరేటెడ్ జర్నల్స్" ఆఫీసు యజమాని గదిలో అడుగుపెట్టేడు.

"గుడ్‌మార్నింగ్, టగ్గార్ట్ "లైట్ హౌస్"కి ఓ వ్యాసం ఇవ్వటానికి జార్జి గ్రెబే ఒప్పుకున్నారు. అయితే, ఆయనకి వ్యాసం వ్రాసేందుకు తీరిక వుండదనుకోండి. అందుచేత అదేదో నువ్వు వ్రాసెయ్యాలి. ఆయన సంతకం పెట్టేస్తారు వ్రాసేది ఆయన శైలితో వుండాలి. ఇంక ప్రతివారం లైట్‌హౌస్‌తో ఆ మాదిరి వ్యాసాలు రావాలి. ఓ అరడజనుమందిదాకా మంచి పేరున్నవాళ్ళని మాట్లాడి వుంచేను."

టగ్గార్ట్ చిరునవ్వు నవ్వేడు. జార్జి గ్రెబే. మంచి ప్రసిద్ధి వున్నవాడు. పేరున్న హాస్యరచయిత. ఆయనపేరు సంపాదించడం గొప్ప ఆలోచన.

"ఆయన జీవితంలో ఎప్పుడేనా ఏమన్నా రాశారా. సర్!"

"రాసేరనుకోను...అయినా నీకు తెలుసుగా, రాస్తే ఏ విధమైనది వ్రాస్తారో. వచ్చేవారం సర్ కుట్మన్ కనేగారి మాటలు తీసుకున్నా. బాగా వ్రాసిన ఏ వ్యాసానికైనా తమ సంతకం ఇస్తామన్నారు. టగ్గార్ట్, చూడు. జనం లైట్ హౌస్ కొనేలా చేస్తా. గ్రెబే వ్యాసం వ్రాయడం ప్రారంభించు."

టగ్గార్ట్ అంగీకారంగా తల వూపేడు జేబులోంచి టైపుచేసిన కాగితాలు తీసి టేబులుమీద పెట్టేడు.

"ఇదిగో సర్. సంపాదకీయం. మీరు చూసుకోడం బాగుంటుంది."

"ఆబ్బే, నాకు అది చూసేందుకు టైం లేదయ్యా. రైలుకి వెళ్ళాలి. మంచి చెడ్డలన్నీ చువ్వే చూసుకోవాలి. టగ్గార్ఛ్ మళ్ళీ శుక్రవారానికి తిరిగి వచ్చేస్తా."

యజమాని వెళ్ళిపోయేడు. సంపాదకీయాన్ని సరిచూసుకొనేందుకు టగ్గార్ఛ్ కూర్చున్నాడు.

"మంచి బాగుంది సంపాదకీయం. కాని, దీనిని వ్రాసిందినేనని ఎవరికి తెలియదు కదా" నుఅకున్నాడు.

ఇతరులకోసం చేసిపెడుతున్న ఈ పని మంచి కళాత్మకంగా వుంది. కళలన్నిటిలాగే దానికిచ్చే ప్రతిఫలం తక్కువ. అయినా, ఎంతో పేరూ, పలుకుబడి వున్నా, యజమాని పట్టి పొట్టు తప్ప, అసలు పలుకు తానే నమకోనడం సరదాగానే వుంటుంది. టగ్గార్ఛ్ వ్రాయడం పూర్తిచేసేడు.

"జార్జి గ్రెబే, ఆయనకోసం ఏం వ్రాసేదబ్బా." టగ్గార్ఛ్ ఆలోచనలో పడ్డాడు. లేచి తన గదికెళ్ళేడు.

జిమ్మీ కౌంటరు పైపు కాలుస్తూ అక్కడ కూర్చుని ఏదో వ్రాసుకొంటున్నాడు. టగ్గార్ఛ్కూడా కూర్చుని, పైప్ ముట్టించేడు. ఓ కాగితం తీసుకొని పైన 'జార్జిగ్రెబే వ్యాసం' అని వ్రాసేడు. జార్జిగ్రెబే! జనం ఎగబడిపోతారు. జనాన్ని ఆకట్టుకొనేవాళ్ళ పేర్లంటే యజమానిగారికి మహాయిష్టం. జార్జి గ్రెబే అంటే జనానికి వెర్రిమోజు. కాని, ఈయనగారి ఆలోచనలు ఎల్లా వుంటాయో ఏమో టగ్గార్ఛ్కి ఏమీ తెలియదు. నవ్వొచ్చింది అంతలో భయంవేసింది జార్జిగ్రెబే, హాస్యగాడు! ఆయనగారికి ఆలోచనలంటూ లేనే లేవేమో. నిజం చెప్పాలంటే, జనానికి మనుషులమీద నమ్మకాలుజాస్తీ టగ్గార్ఛ్ సిరాలో కలంముంచితీసి, ఆలో చిస్తూ కూర్చుండిపోయాడు.జార్జిగ్రెబేఆలోచనలెల్లా వుంటాయో తెలుసుకుందామని. జనం పైసలు చెల్లిస్తారు కాని, ఖర్మం, జార్జి గ్రెబేకు ఆలోచనలే వుండవు.

పట్టిమోసం యజమానికోసం వ్రాస్తున్న ఈ సంపాదకీయ వ్యాసాలు మోసమే. కాని వ్యాసం చివర టగార్ఛ్ అని తనపేరు వ్రాస్తే జనం పత్రిక కొంటారా? అవే ఆలోచనలు – మంచి ఆలోచనలూ, భావాలూనే. కాని వాళ్ళు కొంటారా?

పైప్ మళ్ళీ ముట్టించేడు. సీట్లోంచి లేచి గదిలో పచారు చేసేడు. పక్కటేబులువద్ద కూర్చున్న జిమ్మీ కౌంటరు తలెత్తి చూసేడు. టగార్ఛ్ అతనిని చూస్తూ అన్నాడు.

లైట్హౌస్కి వ్యాసం వ్రాయాలి. కాని, అది పట్టి మోసం అనిపిస్తుంది. నువ్వేమంటావు?"

"ఒక విధంగా అంతే. మరేం చేస్తావు?"

"ఏంచేస్తానేముంది. వ్రాయను."

సహచరుడు తల వూపేడు.

"ఇదిగో సోదరా. చూడు. నేను రేసుల మీద వ్యాసం వ్రాస్తున్నా. కాని, నేను రేస్కోర్స్కెళ్ళి ఎన్ని నాళ్ళయిందో తెలుసా?"

"కావచ్చు. గాని, అందులో పెద్ద తప్పు లేదు."

"మనం చేసేపనిలో దేనికీ తప్పు

లేదు. కళ్లుమూసికొని చెప్పినపనిచెయ్యి. నీకు విచారం ఎందుకు? పేపర్స్ అమ్మేడు పోవాలి."

టగ్గార్ట్ తల గోక్కున్నాడు.

"చచ్చేడు, జార్జిగ్రెబేని చావనీ." అంటూ టగ్గార్ టోపీ చేతికి తీసుకొని గది వదిలి పోయేడు.

శుక్రవారంనాడు యజమాని అతనిని పిలవనంపేడు.

"గుడ్ మార్నింగ్ టగ్గార్ట్"

"గ్రెబె వ్యాసం ఎంతవరకొచ్చింది"

"వ్రాయలేదు."

యజమాని ఎంతో ప్రేమగా వాకబు చేసేడు.

"ఏం వొంట్లో బాగాలేదా?"

"బాగానేవుంది. అదేంలేదు. కాని వ్రాయను."

"ఏం?"

"అది ప్రజల్ని మోసగించడమే అవుతుంది, సర్."

"నువ్వు చెప్పేదేమిటో అర్థం కావడం లేదు, టగ్గార్ట్."

అర్థం కాకపోవడానికేముంది, సర్. ఒకరి పేరు మీద నేనింక వ్యాసాలు వ్రాయను."

యజమాని మొహం కందగడ్డ అయింది.

"నీకు ఓ పనికోసం డబ్బు ఇస్తున్నా. నీకాపని చేయడం ఇష్టం లేకపోతే మానేసెయ్యొచ్చు. కాని, అసలు సంగతి ఏమిటి?"

టగ్గార్ట్ ప్లానహాసం చేసేడు.

"నా ఆత్మసాక్షి అంగీకరించడం లేదు."

యజమాని కుర్చీలో జేరగిలబడి పోయేడు. ఇరవై సెకన్లపాటు అల్లా చూస్తూవుండి పోయేడు.

చివరకు తేరుకొని, ఖండితంగా చెప్పేసేడు.

నన్నెవ్వరూ ఇంత అవమానం చెయ్యలేదు. గుడ్ మార్నింగ్, నీయిష్టం మరి."

టగ్గార్ట్ కాగితాలు టేబిలుమీద పెట్టేసి. గుమ్మం దాకా వెళ్లి, వెనక తిరిగేడు.

"ఏమనుకోకండి. తప్పదు."

అతడు వెళ్లిపోయేడు.

మూడు నెలల పాటు టగ్గార్ట్ స్వేచ్ఛగా తిరిగేడు. ఎక్కడా అతనికి పని దొరకలేదు. పేరున్న మనిషి కాదయ్యె. "కంగ్లామరేటెడ్ జర్నల్స్" నుంచి ఎందుకు మానుకున్నావని ఎవరన్నా అడిగితే"- మాట పట్టింపు వచ్చింది. వాళ్ల పద్ధతులు నాకు నచ్చ లేదు." అనేవాడు.

రెండు నెలలపాటు బాగానే నడిచింది. కాని, గత కొద్ది వారాలనుంచీ అతని స్థితి దిగజారి పోయింది. ఎంత ఆలోచించినా తాను చేసింది తప్పనిపించడంలేదు. జార్జిగ్రెబె, సర్ కుట్మన్ కనేల వ్యాసాలను అతను చదివేడు. అవి ఎవరో వ్రాసినవి తిట్టుకున్నాడు. యజమాని వ్రాసిన కొత్త సంపాదకీయాలు చదివేడు. చదువుతుంటే ముఖాన నవ్వు పోయి కోపం వచ్చింది. అయినా తాను చేసింది తప్పనుకోలేదు. వారాలు గడిచిన కొద్దీ తన అసమ్మతి నిరుపయోగం అయిపోయిందని అర్థం అయింది.

ఇంక ఇప్పుడు కోరడిపక్కకూర్చుని,

పక్షుల కలకలం వింటూ, గతం అంతా తలచుకున్నాడు. మనుష్యులు తమాషా అంచనా వాళ్లు. పైకి మంచిగా వుంటే వాళ్ల దృష్టిలో అన్నీ మంచివే. తానూ అల్లానే అనుకున్నాడు. ఎన్నో ఏళ్ల పాటు. ఆత్మసాక్షి - చాలా కొద్ది మందిలో వుంటుంది. ఈ జరిగిన దానికి మూలం అక్కడేవుంది.

---

## జ్వాల - జ్వాల

కయ్‌సీను కులియేవ్

అను : కిషోర్

దూరాన వినిపించె నొక పడతినోట
చిరు మువ్వ సడిపోలు ఓ జోలపాట
లోకాల శోకాలు చీకట్లు అన్ని
ఆ జోలపాటగా అల్లుకున్నాయి
రణభూమి వెలువరుచు ప్రతి ఒక్క గుండూ
తొలుచుకునిపోతుంది ఒక తల్లి గుండె
విజయ మెవ్వరినైన వరియించవచ్చు
తల్లి గుండెలుమటుకు తల్లడిలి తీరు.

---

## ఆర్తనాదం విన్నారా

మళ్ళీ తెలుగునాట తుఫాను. ప్రకృతి భీభత్సం. జల ప్రళయ నృత్యం. ఎన్ని ఇళ్ళల్లో వెలిగే దీపాలు మలిగాయో!? ఎందరి బతుకుల్లో చితులు మిగిలాయో! వందలాది కోట్లనష్టం.

దీనికి జవాబు మనందరం చాచే స్నేహ హస్తం.

ముఖ్యమంత్రి నిధికి మనమిచ్చే విరాళం.

ప్రకృతిపై తిరుగుబాటు చేద్దాం;

కథానిక

# తీర్మానం

పి. మాధవరావు

వెన్నెట్లో మంచం వాల్చుకుని కూచున్నాను. రాములు దగ్గరగా వచ్చి, ఐదేళ్ళ తర్వాత నేనీ వూరికి వొచ్చినందుకు ఆప్యాయంగా మాట్లాడసాగాడు. విషయాలు ఏఁవిటని అడగ్గా, అంతకు ముందు ఎన్నో జరిగినా ఈ రోజు జరిగిందంటూ చెప్పసాగాడు.

"పొద్దుట్నుంచి మాదిగాడ కట్ల లొల్లిలొల్లిగున్నది. ఆడోళ్ళు మొగోళ్ళు అంత నోర్లు మూస్కోకుండ ఎవర్నో తిడ్తుండరు. మాదిగె పెంటిగాని బిడ్డ సూరిని నాత్తిరి రాజిరెడ్డి గుంజిండంట. అదేమొ ఒకటే ఏడుస్తున్నది ఎవర్కి జెప్పలేదు. గది రాజిరెడ్డి నడిగిండు మాదిగోళ్ళంతా గల్సి "నా కాడికొస్తె చెప్పుదీస్కొదంత ఏవన్కున్నరు. మీ పిల్ల సక్కనయిందా, రేటు దక్వాయిందని మొత్కుంటున్నదేమె నంజ ... రిపోరటిస్త ఏవనుకున్నరో అఁ...ఈ బేరం మొదలైందా మనూళ్లె ఎన్నళ్లైంది" అంట ఏమో శానా శానా తిట్టిండు రాజిరెడ్డి. గదంతా ఇని సప్పుడుగా కొచ్చింరు మాదిగోళ్ళు.

నెత్తి నెండ గొడ్తున్నది బాగ. నెత్తిగాల్నట్టే మాదిగోళ్ళ కడుపుల్ల ఆకలి గాల్తున్నది. ఆకలిమంటకంటె వాళ్ళ గుండెమంట లెక్వయి వాళ్ళ కొకళ్లు దెలుస్తలేవు. అఁదర్ పోలీసు పటేల్ వాకిట్ల జేరిఁరు. మాదిగోళ్ళు పటేల్కు దఁడం బెట్టింరు. సూరి దూరంగ ముక్కు జీద్కుంటనువడ్డది.

"ఎంద పెంటిగా ఏం సంగతి" అంటడిగిండు పటేలు మల్లి రెడ్డి.

"గులాబోన్ని పటేలా మీరు పెద్దోళ్ళు. ఏంజేంశినా జెల్తది. మేం నోట్ల తళ్ళే నోళ్ళం. సంపినా మీరె సాకినా మీరె అంట పెరిగినం మీ కాళ్ళకాడ బాంచెన్ ...." అంట సగం జెప్పి ఆగిండు పెంటిగాడు. గది ఇని.

"ఏంద పూరగ ఇసయం జెప్పు - నీకేం బయంలే" అన్నడు మల్లరెడ్డి

మల్లరెడ్డి ఈళ్ళతోని మాట్లాడుతున్నా సూరికేశి జూసి గుట్కలు మింగుతున్నాడు. గదిని జెర ధైర్నమొచ్చింది పెంటిగానికి.

"ఏం జెప్పాలె బాంచెన్ మాపోరి వొయిసులున్నది. నాతాన పైసలేక

లగ్గంజెయలే...రెక్కాడ్తెనేకాని దొక్కాడ్తది మాకు. నాత్తిరి అది కట్టెలకు పోయిందట... బాంచెన్ ... శాన కట్టెలొట్టి అల్కి జెర జాల్నాక పోదావని గుట్టలకాడ కూకున్నదంట. ఇట్లనే మూడ్దినాల్నుండి రాజిరెడ్డి పటేల్ జూస్తున్నదంట... నాత్తిరి... నీకాల్మొక్త .... బాంచెన్ జెరసాటుకు రమ్మన్నడంట అది పోలేదంట...అయితె నీ బాంచెన్ ఏంజెప్పాలె... నోరాస్తలేదు. కన్న తండ్రిని గద పటేలా...ఇకరాజిరెడ్డిఊర్కోలేదంట" అంటజెప్పి చిన్నపోరనొత్తు ఏడుస్తున్నాడు పెంటిగాడు. గదంత ఇని మల్లరెడ్డి "ఏం పోరి ఇదంతనువద్ద నేనా" అంటడ్గిండు ఓరగజూస్త. సూరి తల్కాయెత్తి సూసి పటేల్ సూపులకు మల్ల కింది మొకాన ఒంగి "నువద్దనె పటేలా బాంచెన్ ... అవద్దమెందుకు జెప్తం గులాంబుదాన్ని" అంటుంది. మల్లరెడ్డి శిన్నగ నగిండు. నగి అటే వొస్తన్న రాజిరెడ్డి దిక్కు జూశినగిండు.

"ఏంజేంతాంర పెంటిగాఅయితే... నువ్వెజెప్పు రాజిరెడ్డి మీద రిపోరటియ్యగా పటేల్ను పోలీసోళ్లు పట్కపోవాల్నా" అంటడిగిండు.

"నీ బాంచెన్ నేనేంజెప్త పటేలా... ఇసయంగది.... ఇగ తీర్మానం నువ్ జెప్పు" అంటన్నడు పెంటిగాడు.

రాజిరెడ్డి మల్లరెడ్డి మొకాల్జూసుకున్నరు అళ్లిద్దరు బావమర్దులు గావలె.

ఏం రాజిరెడ్డి బావ ఇదంతమువద్ది నేనే...ఊళ్ళ జెప్తున్నది" అంటన్నడు మల్లరెడ్డి.

"ఏంబావో నువ్గూడ పదుగుర్ల పరువుదీస్తవు. గాడ్జెప్తె ఎట్ల నమ్మ్తవ్" అంటన్నడు రాజిరెడ్డి.

"మళ్ళెంజాక సప్పుడ్జేయక పోతివేంది" అంటన్నడు మల్లరెడ్డి.

"ఏం జేతాం వాడంత కతసెప్తున్నడు...చెప్పనీ ఏవేంజెప్తడో సూతిని అని ఊరుకున్న" అంటున్నాడు రాజిరెడ్డి. జెరసేపెవరు సప్పుడు జెయలే.

"అసలిసయం జెప్త నమ్ముతవ్ గద.. పాపవంనివూర్కుంటె అన్నాయమెక్కైతదట .. బావా మన తాతల కాణ్నుంచి జెర...సిగ్గిడ్చిపెట్టి చెప్తున్న నన్నొక....మాదిగిండ్లల్ల ఇదీపనిచేస్తున్నదని .." అంట రాజిరెడ్డి సాంతం జెప్పక ముందె నడిమీతల పెంటిగాడందుకుని.... "ఎవర్పటేలా చెప్పింది నాల్కె జీలెయ్య .." అంట ఇవతల్కొచ్చాడు గుంపులకెల్లి.

నోర్మూస్కోరా నేన్లె నడ్గెటందుకీడ...అసల్ మీ మాదిగోళ్ళ సొకకు వయినోండ్లా "అంటని" చెప్పు బావా చెప్పు" అని రాజిరెడ్డి దిక్కు దిరిగిండు మల్లరెడ్డి.

".... ఆసంగతెల్పుకొని జెరరేటు దక్కయిందనుకో దానికి... ఇగ వీకు నాకు ఎర్కలేందేవున్నది. ఇయ్యాల రిపోరటియ్యంగదే నాకు నిద్రవట్టదు. అసల్ వొక్కణ్నన్న జేల్కు పంపంది సక్కగ్గారు ముండకొడ్కులు" అంటని ఆగిండు రాజిరెడ్డి. మల్లరెడ్డి ఇశార జేయంగనె జెరసేపు లోపల్కిపోయొచ్చింరు ఇద్దరు.

"ఏంర పెంటిగా ఏం జెప్పు మనోళ్లు గదాని వూర్కుంటే గానాయేం లేదు గదా... (రివోరటు పంపుతున్న తంతె సక్కగాయిత్తరా" అని "కాయిదం రాయి పంతులూ" అంటన్నడు మల్లరెడ్డి.

"పటేలా గులాబోన్ని ఎన్ని పంచాయితు లొచ్చినా మానూరి సంగతి బైటికెక్కలేదు. తమరేమి ఎంత వద్దెనన్నా నమ్మకపోతిరి. ఇంక మమ్మల్నె పోలిసోళ్ళతోని దన్ని స్త వంటరు."

ఇగో గామాటనకురో పెంటిగా కోపమొ స్తది. ఏ ం ది రా నువ్ జెప్పింది. అంట కోపానొచ్చింది మల్లరెడ్డి.

"గులాబోన్ని కోప్పడకు పటేలా" అంట కాళ్ళమీద పడి ప ది రూపాయ లోట్లు కాళ్ళకాడ వెట్టిండు.

"శీ...శీ శీ....ఏంద నాకుపై సలి స్తవు ఏవన్న లం చ గొందోణ్ణనుకున్నావా ఖబడ్దార్ తప్పుజేశి లంచం బెడ్తావ్ నీయమ్మ"

"పటేలా ఇగేం జెప్పాలె నీ గులాబోన్ని ఎన్నడూ" అంటన్నడు పెంటిగాడు ఏడ్సుకుంట.

"నాకేం దెల్వదు. రాజిరెడ్డి కాల్లు వట్కో ఆయినిడ్చి పెట్టవంటెసూతాని" అంట జెరమెత్త వడ్డట్టు జేశిండు మల్లరెడ్డి. పెంటిగాడు రాజిరెడ్డి కాళ్లు వట్కున్నడు. రాజిరెడ్డి కోప్పడి కోప్ప "శీ...శీ సిగ్గులేదు .. తప్పు దాస్కుందావన్కున్నావురా నీ యమ్మ...నీ" అంటడు.

పోనీ బావ మనోడేగదా, అని రాజిరెడ్డి. పెంటిగాడు మళ్ళ కాళ్ళు పట్కోని ఇంకో పదిరూపాయల నోటు రాజిరెడ్డి కాళ్ళకాడ వెట్టిండు. "ఇగపోనీ...బావ జెప్పిండుగన్క మనోడని ఊర్కున్న" అంట నోటుదీస్కోని "శిచ్చేందిరా.... శిచ్చ లేని తీర్మాన వేంగాని అదివోరికేం శిచ్చలేదు.—నీకియ్యాలె తండ్రివై తప్పుడు పనిజేయించినందుకు." అంటున్నడు రాజిరెడ్డి.

"అరె కొరలోడా ఆ బండ ఇట్లదే అతె వొంగుర పెంటిగా" అంటన్నడు మల్లరెడ్డి. ఏడుస్త వొంగిండు పెంటిగాడు. ఊపుమీద రాయి వెట్టి పిచ్చి జెరసేపయినాక దీపిచ్చిండు.

"పోరో ఇగవో అందర్కి బుద్ది జెప్పాలెగాని మనంజెప్పించు కుంటాంత ఇంత వొయిసొచ్చింది. వోరి బుద్దిలేక ఈ పని జేస్తావె నిన్ను గన్నందుకు మీ అయ్యకు ఎంత ఆపతి వొచ్చెసూడు ఇట్లైతె నిన్ను మనువాడి టోడివడే"

అంటన్నాడు మల్లరెడ్డి. సూరికిది 'ఇసం' మింగినట్లన్పిచ్చింది. అందరు మెల్లగ వోయిందు. రాజిరెడ్డి దిక్కు జూశి నగిండు మల్లరెడ్డి. మల్ల కర్ణం రంగారావు దిక్కుజూశిండు "ఏం పంతులూ" అంట వొంగి పదిరూపాలోట్లుదీస్కోని జేవుల కిల్లి మ్యూడ్రూపాలు దీశిచ్చిండు రంగారావు రాజిరెడ్డి దిక్కుజూశిండు. రా జి రె డ్డి నగుత తనో ఎండ్రూపాలిచ్చిండు.

"పోత బావ" అంట లేశి "తీర్మానం బాగ జెప్తివి" అంటండు రాజిరెడ్డి. అందరు మల్లోసారి నగిందు."

అంతా చెప్పి 'మీరేవంటరు' అన్నాడు రాములు.

కథానిక

# పీర్ల పండగ

**-శ్రీమతి పి. సంజీవమ్మ**

అనంతపురం జిల్లాలో అదొక పెద్ద గ్రామం. ఆ దినం పీర్ల పండగ, పండగ సంబరం జోరుగ సాగుతోంది. ఊరంతా వుత్సాహంతో వూగిపోతోంది. ఇంత వుత్సాహం ఉగాదినాడైనా ఈ వూర్లో చూడలేం. చుట్టుపక్క పల్లెల జనం ఈ పండగ రెన్నాళ్ళు ఇక్కడే మకాం. ప్రతి ఇల్లు చుట్టపక్కాలతో నిండివుంటుంది. పది పదిహేను ఇళ్ళు వుంటే ఎక్కువ ముస్లింలవి ఆ వూర్లో. ఆ పండగ సంబరమంతా ముఖ్యంగా హిందువులదే. చూచేవాళ్ళకు ఈ పండగ హిందువులదా, ముస్లింలదా అన్న ఆశ్చర్యం కలక్కపోదు. 'మొహరం' అనే మాట చాలామందికి తెలీదు. 'పీర్ల పండగ' అనేదే ఈ జనం వాడుక.

పండగ రెండు దినాలు జరుగుతుంది. మొదటి దినం గుండానికి మాండ్లు తోలే కార్యక్రమం పెద్ద వేడుక. ఒక్కొక్క తోట రైతు పోటీపడి పెద్ద పెద్ద మాండ్లు తోలుతాడు. వాటిని ఈడ్వటానికి ఎన్నాళ్ళ నుండో మాంచి ఎద్దుల్ని ప్రత్యేకంగా మేపుతారు. మాండ్లను ఈడ్పించేనాడు శ్రద్ధగ అలంకరిస్తారు. ఈడ్చేటప్పుడు ఒకటే కేకలతో తప్పెట్ల శబ్దాలతో పౌరుషాన్ని పోస్తుంటారు వాటికి.. ఎవరి ఎద్దు ఎలా పరాక్రమాన్ని ప్రదర్శించిందో పండగపోయిన చాల నాళ్ళవరకు మురిపెంతో చెప్పుకుంటూ వుంటారు.

'పక్కీర్లు' అయి పీర్ల స్వాములకు మొక్కుబళ్ళు చెల్లించుకోవటం, సాయంకాలం ఊరంతా గుంపుగ పానకాలు చదివించేందుకు మసీదుకు బయల్దేరటం చూచితీరాల్సిన దృశ్యాలు. అందులోనూ 'మాదిగగేరి పానకాలు ఎల్లటం' మరొక ప్రత్యేకత. ఇదంతా అర్ధరాత్రి వరకు సాగుతుంది. తరువాత పీర్ల స్వాముల మెరవన (వూరేగింపు). అందులో 'సాహుసేన్' ఆడటం గురించి చెప్పకోక తప్పదు. మొదటి వరుసలో ముసలివాళ్ళు నలుగురు నలుగురుగ ఒక్కొక్క జట్టు తయారై చేతులు కలిపి మహా నిండుగ హుందాగా భక్తితో లయబద్ధంగ అడుగులువేస్తూ 'సాహుసేన్' ఆడుతూ వుంటే ఆదేపనిగ చూస్తారు జనమంతా. చాల ముచ్చటగ వుండే దృశ్యం. ఇక వూరేగింపు పొడవునా పడుచు కుర్రవాళ్ళు 'సాహుసేన్, సాహుసేన్' అంటూ తొక్కే చిందులు వేసే గంతులు కేకలు రక్తాన్ని ఉడుకెత్తిస్తాయి. పదిపది గుండ్రంగ చేతులు కలిపి - నిలిచి, మధ్యలో ఒక మాదిగవాన్ని నిలబెట్టి తప్పెట వాయింపమంటారు. తప్పెట జోరు ఎక్కువో చిందులు తొక్కేవాళ్ళ వేగం ఎక్కువో చూచేవాళ్ళు పోల్చుకో

లేరు. ఒక్కొక్కసారి ఆడేవాళ్ళే తప్పెట లాక్కొని మోగించి వేయడమూ కద్దు ఆవేశంలో. శివమెత్తినట్లుండే దృశ్యం అంతా. మనుషులు ఇంత మహోత్సాహంగ కూడ వుండగలరా అని ఆశ్చర్యం వేస్తుంది. ఈ సమయాల్లో మాదిగ వాళ్ళకూ, ఇతరులకూ ఏ అంటరానితనమూ అడ్డురాదు. అంతా రాసుకుంటూ పూసుకుంటూ ఎగురుతారు, గంతులేస్తారు. ఇదంతా చూస్తుంటే ఈ మనుష్యులేనా కులాలని, మతాలని కృత్రిమంగా అడ్డుగోడలు పేర్చుకొన్నది అన్న సత్యం స్ఫురణకు రాకమానదు. కృత్రిమంగా పేర్చబడ్డవే కనుక ఒకనాడు కూలిపోక తప్పదన్న సంగతి ఇంగితానికి వస్తుంది. ఊరందరూ తమదిగ చేసుకుంటూన్న ఈ పండగను తిలకించిన ఏ మానవున్నైనా అయినా 'ఈ హిందువులు ఈ ముస్లింలేనా మతకలహాల పేరుతో తలలు తరుక్కుంటూన్నది' అన్న సందేహం పీడించక మానదు.

మొదటిదినం నాటి ఈ సంబరమంతా ఒక ఎత్తు; మరుసటి దినం పీర్లు ఏటికి పోయే దినం—సోమప్ప మండే గుండంలో దూకి నిక్షేపంగ బయటికి చాటుకొని వచ్చే దృశ్యం ఒక ఎత్తు. ఆ మహత్తు చూడటానికి జనమంతా విరగబడతారు ఆనాడు. ఆ జనానికి దేవుని 'సత్యం' మీద వున్న గురికి తిరుగులేదు.

సోమప్ప అంటే ఆవూర్లోనే కాదు చుట్టుపక్క పదామడ దూరంలో వున్న వూర్లదాక తెలియని జనంలేరు. సోమప్పకు నడివయసులోనే పెళ్ళాం పోయింది. నా అని చెప్పుకో తగ్గ వాళ్ళులేరు. పెళ్ళాం పోయిన నాటి నుండి అతని తత్వమే మారి పోయిందంటారు. 'కుళ్ళాయిస్వామి'కి భక్తుడయినాడు. అప్పుడు స్వామి పూనకం వస్తుంటాడు. చూడడానికి కాస్త బలహీనుడే అనిపించినా చాల సాహసవంతుడంటారు. ఆరు పదులు దాటిన వయసు ఇప్పుడతనిది. ఏడెనిమిది సంవత్సరాల నుండి గుండంలో దూకుతూ స్వామి మహత్తు చూపుతున్నాడు. ఈ విశేషం జిల్లా అంతా పాకింది.

*    *    *

ఆనాడు గుండానికి మాండ్లుతోలే దినం. ఝాటపొద్దవునా మాండ్లు తోలు కొచ్చి విడిచినారు. రాత్రిలోగా అవన్నీ గుండం చేరాలి. మధ్యాహ్నం కాసేపు ఎద్దులకు విశ్రాంతి. పెద్దరుగు దగ్గర పదిమంది కలిసి పిచ్చాపాటి మాట్లాడుతున్నారు పెద్దన్న చిన్న రైతు. ఫకురుద్దీన్, రాములు రైతు కూలీలు, ముగ్గురి 'దసూస్త' ఒకరకమే పండగ కదా కొత్త లాంగ్లాత్ అంగీలు తొడుక్కొన్నారు, సైను పంచలు కట్టుకున్నారు. పెద్దన్నా రాములూ అప్పుడే ఒక్కొక్కడు రెండు కంచాల పరమాన్నం 'ఫుల్లాగా' పట్టించి వచ్చినారు. ఫకురుద్దీన్ ఉపవాసం— పీర్లకు పానకాలు చదివింపులు కావాల మరి.

పెద్దన్న : అనంతపురం నుండి నాలుగు రిజర్ పోలీసు వ్యాన్లు పోయి నాయంటప్పా అదోనికి నిన్న ఈ నామాళ్ళకు ఏమొచ్చిందో కొట్లాడి సచ్చేకి, మనకి తెల్దప్పా.

ఫకురుద్దీన్ : అవునన్నా ! నేనూ ఋంటి. మొన్న సిన్నపరెడ్డన్న ఈడ పేపరు సదువుతా వుండి సెప్పినాడు— ఆదోన్లో సాయిబులూ హిందువులూ అంటని జాస్తి కొట్లాడు కొంటున్నా రంట.

రాములు : అవ్ అది యాడో 'ఆలీ గడ్డ' సీమంట. పెద్దన్నా అడగూడ ఇదే కతంట తలకాయలు నరుక్కొంటుండా రంట. నీమతమూ నా మతమూ అంటని ఈ పక్క మనూర్లలో యానాడు కొట్లా డుకోంగా సూల్లేదప్పా మనతాతల కాలం నుండీ.

ఫకురుద్దీన్ : మనకి కొట్లాట ఏంటి కొత్తా దన్నా. నువ్వు కష్టం జేసిన సొమ్ము నేను పీక్కోలేదు, నా సొమ్ము నువ్వు పీక్కోలేదు. ఎవుని కష్టం వాడు తినేదానికి కొట్లాట ఏంటి కొస్తాది.

పెద్దన్నా : రైట్ గ చెప్పినావు ఫకు రుద్దీనూ: మనం పనైయ్యక పోతే మరి మన మతాలేమైనా బువ్వపెడతాయా నాకు తెలీక అడుగుతాగాని— దీండ్ల కోసంకొట్లాడు కొంటూ కూసుండేకి. ఏందో పెద్దోళ్ళు సేసి పోయినారు మత మంటనీ దేవుడంటనీ. పండగ పబ్బమూ వొస్తే కలిగింది ఇంత వొండు కుంటాం స్వామీ రామా అనుకోని తింటాము ఈ కాడికల్లా. నీ దేవుడు జేసేదేముంది నాదేవుడు జేసేదేముందోయ్.

ఫకురుద్దీన్ : అంతేగదన్నామరి ఈ పొద్దు మాత్రం మాపండగంతా మీదే నన్నో !

రాములు : ఏందోయ్ మాపండగ మీ పండగ అంటని ఈ పొద్దు కొత్తగా మాట్లాడు తుండావు.

ఫకురుద్దీన్ : అయ్. తమాషాకి అంటిలే రామన్నా ! ఈ యేడు గుండా నికి మాండ్లు కానా పడతా వుండా యన్నా. సందకాడ అట్లా పిల్లోల్లని గుంపేసుకొని గుండంకాడ మాండ్లు బిరిబిరి కొట్టేపించండన్నా. లేకపోతే రేపియ్యాలకు ఈ మాండ్లన్నీ పూరా కాలి పోవల్లంటే అయ్యేట్లేవు.

పెద్దన్న : ఈ పని నువ్వు మాకు చెప్పేది వుందా ఫకురుద్దీనూ. మా పని అంటావా, నీ పని అంటావా, మామా పిల్లోన్ని పొద్దున్నే అంపించి పదండ్లలో పది గొడ్డెండ్లు తెప్పిచ్చి పెట్నానప్పా. మాండ్లు గుండం కాకి వచ్చేతలికి మేము ఆడ రడీగ వుండమా? అని 'రేపు సోమప్ప మామ గుండం దిగే కత ఏంజేత్తాదో ఏమో' అంటూ గొణుక్కొంటూ వెళ్ళిపోయినాడు.

'అన్ని మతాలు సమానం – దేవు డొక్కడే' అన్న నీతి బోధలు ఈ పాటక జనానికి తెలియవు. వాళ్ళ వాస్తవ జీవితమే వాళ్ళకు ఒద్దికగా బ్రతికేది నేర్పింది. మత కలహాల వెనుక వుండే స్వార్థాల గురించి యోచించే పరిజ్ఞానం వాళ్ళకు లేదు. వాళ్ళకున్న విచక్షణా జ్ఞానం పరిధిలోనే విశ్లేషించుకున్నారు వాళ్ళు. వాళ్ళ జీవితాల్లో మతం సంగతి గుర్తొచ్చే సందర్భాలు చాల తక్కువ. అవీ కేవలం మిథ్యాచారాలు పాటించ టానికే. అంతకంటె అవసరం వారి కుండదు.

*            *            *

రాత్రి నుడి గుండం కణకణ మండుతూంది. అంత పెద్ద గుండం ఆ జిల్లాలోనే ఎక్కడా లేదంటారు చూచిన వాళ్ళు గాలికి చుట్టుపక్కల వున్న ఇళ్ళ మీదికి నిప్పు రవ్వలు ఎగిసి పడు తున్నాయి. గుండం చుట్టూ నాలుగ్గజాల దూరంవరకు మనుషులు నిలబడలేక పోతువ్నారు ఆ శాకానికి (వేడికి) ఇంకా కాలవలసిన మొద్దులు చాలానే వున్నాయి గుండంలో. మధ్యాహ్నం దాటింది. మూడు గంటలనుండి పీర్లు ఊరేగింపుతో ఏటికి పోవాల. జనమంతా వూరేగింపు చూడటానికి అప్పుడే మిద్దెలెక్కి కూచు న్నారు. చుట్టు పల్లెలనుండి వచ్చిన జనం ఎక్కువ భాగం పీర్ల మసీదు ప్రాంతాల్లో నిండిపోయి వున్నారు. ఊరేగింపులో పీర్లను ఎత్తుకొని మోయవలసిన వాళ్ళు వుపవాసం వుండి బావిలో మునిగి రావ టానికి పరుగెత్తుతున్నారు. ఒకటే కోలా హలం.

సోమప్పను స్వామి పూనినాడు. పరుగు తీసినాడు బావిలో మునిగి రావటానికి. పెద్ద గుంపు పరుగెత్తింది అతని వెంట రెండు ఫర్లాంగుల దూరం బావిదాకా. పిల్లలకైతే చెప్పలేనంత కుతూహలం సోమప్పకంటే ముందు వాళ్ళే బావికి దౌడుతీసినారు. బావిలో దూకింది తడవు, తిరిగి పరుగు తీశాడు సోమప్ప మసీదు వైపు. నేరుగా పీర్లస్వాముల్ని చేరు కోవాలంటే గుండం దాటాల. ఎక్కు తున్న జనమూ అంతా అతనికంటే ముందే పరుగు 'గుండంవద్దకు. సోమప్ప పరుగుతో ఎప్పుడు దూకినాడో తెప్ప పాటులో—నడిగుండంలో నిప్పులమీద అంగలు వేస్తున్నాడు- ఇంక రెండు అంగలువేస్తే అవతలిగట్టు - కాబుతూ వున్న రాక్షసి మొద్దు ఒక అడుగును అడ్డుకుంది. రెండో అడుగులో బోర్లా పడిపోయిన సోమప్ప రెప్పపాటు లేకుండా నిలిచిపోయిన జనం- ఒక్క పెట్టున హాహా కారం - ఏం చేయాలో తోచని ఒక్కక్షణం- మరుక్షణం ఒక అడుగు వంగి పదిచేతులు సోమప్పను బయటికి లాగినాయి- మూగినజనం- వుడికిపోతున్న దేహం-దాహం అందించి నారు. మెల్లగ మసీదులోనికి చేర్చినారు. స్వాముల పాదాలదగ్గర. మల్లా ప్రార్థన చేసినారు. కొందరు పరుగెత్తి ఆంజ నేయస్వామికి టెంకాయలు కొట్టి వచ్చి నారు. అరిటాకుల్లో చుట్టి సోమప్పను ఇంటికి చేర్చినారు. హెల్త్ సెంటర్ డాక్టరు వచ్చినాడు. వొళ్ళంతా అప్పటికే బొబ్బలెత్తింది. స్పృహలో లేని సోమ ప్పకు ఇంకా మంటలు తెలియలేదు. వూరిజనం అంతా ఆత్మీయులే అయినారు సోమప్పకు. సేవకు. వైద్యానికి లోటు జరగలేదు.

పీర్ల స్వాముల్ని ఏటికి వెళ్ళ కుండ ఆ పడానికి లేదు. జనానికి వుత్సాహం సగం చచ్చింది. యథావిధిగానే కార్యం ముగిసింది.

తెల్లవారేసరికి సోమప్పకు బాగ స్మరణ కలిగింది. మంటలకు తట్టు కోలేక పోతున్నాడు అమానవుడు' వొళ్ళంతా నవనీతం పూసినారు. అరి టాకుల్తో కప్పినారు. డాక్టరు తన ప్రయత్నాలన్నీ చేస్తున్నాడు. మూన్నా

ళ్ళ ఆ జీవి ఆర్తనాదం ఆపలేదు. వూర్లో కంట తడిపెట్టని ప్రాణి లేదు. నాలుగోనాటికి వాళ్ళు మంటల గురిం చిన స్పృహ జారి పోతూంది సోమ ప్పకు. మూలుగు మొదలయింది. చుట్టూ వున్నవాళ్ళు పలకరించటానికి ప్రయత్నం చేస్తున్నారు. అతని నోరు పెకలించుకొని రెండుమాటలు వచ్చి ఆగినాయి— 'స్వామి సల్లగా సూడాల అయితే ..' కొరవ మాటలు స్వామికే వినిపించేందుకువెళ్ళిపోయినాడుసోమప్ప.

"ఒరే దేవునికి ఎంత కనికరం లేక పోయిందిరా" ఒక ముసలి గొంతు వాపోయింది.

"దేవుడు చేసేదేముంది పెద్దయ్యా! వయసు కండలు కలిగి నన్నాళ్ళు దుంకి బయటికి ఈదినాడు. బాగ దళిలి పోయి నాడు మనిషి. పోయిన ఏడు బయట పడేదే కష్టమై పోయింది. ఈ యేడన్నా ఇంక గుండంలో దూకేది మానుకో మామా అంటే నామాట ఇన్లేదు..." పెద్దగొంతు

'ఆయుస్సు తీరింది. ఆస్వామే పిలుచ్చుకు పోయినాడప్పా తనతావుకి. ఆయన మహత్యానికి మనం ఎదురు సెప్పే వాళ్ళమా.......' ఒక ముసలవ్వ.

స్వామి మహత్తును గురించి ఆలో చనలో పడినాడు పెద్దన్న.

(వాస్తవ ఘటన ఆధారంగా)

మినీకథ :

# ఇద్దరూ ఇద్దరే

మల్లాది వెంకటకృష్ణమూర్తి

శేషసాయిని, ఆమె స్నేహితురాలు మాట్లాడుకుంటున్నారు. శేషసాయి భర్త అఫీసు నుంచి ఇంటికి వచ్చేసరికి తన భార్యని చూసి కొద్దిగా కోపంగా తిట్టాడు ఆమె భర్త నెమ్మదిగా.

అఫీసులో అలసిపోయి నేనింటికొచ్చే సరికి జిడ్డు కారుతున్న మొహంతో మాసిన బట్టలతో ఏమిటీ అవతారం? కాస్తంత శుభ్రంగా వుండలేవూ?"

ఆ మాటలు శేషసాయి స్నేహితు రాలి చెవిన పడనే పడ్డాయి. పక్కవాటా లోనే అద్దెకు వుంటోంది ఆ అమ్మాయి. ఆ అమ్మాయికి కొత్తగా పెళ్ళయింది. వెంటనే తన వాటాలోకి వెళ్ళి గబ గబా మొహం కడుక్కుని, పౌడర్ రాసుకుని ఇస్త్రీ చీర కట్టుకుని, పువ్వులు పెట్టు కుని భర్త రాకకోసం ఎదురు చూడ సాగింది: ఆయన వచ్చాడు. షోకు చేసు కొని వున్న తన భార్యని చూసి అడి గాడు విసుగ్గా. "ఎక్కడికీ బయలు దేరావు?"

# అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో మన సినిమాలపై తీవ్ర విమర్శలు

## నంద గోపాల్

ప్రపంచ చలన చిత్ర పరిశ్రమలో మనదే అగ్రస్థానం. నిజం – ఏటా దాదాపు 600 చిత్రాలు మన సినీ ఫ్యాక్టరీలు ఉత్పత్తి చేస్తున్నాయ్. 200 కోట్ల రూపాయల వినోదపు పన్ను ప్రభుత్వ ఖజానాకు చేరుతోంది. రెండు లక్షల మందికి తిండీ గుడ్డ సమకూరుస్తున్నది. (దా ?) మన సినిమా, మన తారలు పాలీ హిల్స్‌లో కొండల మీద–ఇంపాలా మెర్సిడజ్ బెంజ్ కారుల్లో షికార్లు తిరుగుతూ ఉన్నారు. ఎంతటి అభ్యున్నతి సాధించాం మనం !

మన చిత్రాలకు అంతర్జాతీయ గుర్తింపు వచ్చింది. రే, మృణాల్‌సేన్, శ్యామ్ బెనెగల్, అదూర్ గోపాల్ కృష్ణన్, అరవిందన్, యం. టి. గిరీష్ కార్నాడ్, బి. వి. కరంత్. గిరీష్ కాసరవల్లి, యం. యస్. సత్యు, బాసుభటర్జీ మొదలైన 'మరో సినిమా' స్రష్టల వల్ల. అయితే సగటు భారతీయ సినిమాలను గురించి ప్రపంచం ఏమనుకొంటోంది ? అసలు అద్దంలో 'మనసినిమా' ముఖం ఎలా కనిపిస్తోంది ?

ఇటీవల న్యూఢిల్లీలో — ఏడవ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో దేశ, విదేశాలకు చెందిన ప్రముఖులు వచ్చినప్పుడు, మన సినిమాను గురించి వారు వెలిబుచ్చిన అభిప్రాయాలను క్రోడీకరించి పరిశీలిద్దాం.

ఓస్మాన్ సెంబేన్ – ('ఫోప్ ఆఫ్ ది ఆఫ్రికన్ ఫిల్మ్' – సెనెగల్) పత్రికా విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ "నేను భారత దేశం వచ్చాను. న్యూఢిల్లీ, ఢిల్లీ, మథుర, ఆగ్రా చాలా భాగం – సగటు భారతీయ జీవితం చూశాను. మీ రోడ్ల మీద ఎక్కడా యువతీ యువకులు చెట్టపట్టాల్ వేసుకొని, పాటలు పాడుకొంటూ, పచ్చికల మీద ప్రేమ గీతాల పేరుతో దొర్లుతూ నాకు కన్పించలా. కాని ఢిల్లీలోని ఏథియేటర్‌లోకయినా వెళ్ళి తలుపులు తెరచి చూడండి. పాటలు, డాన్సులతో హోరెత్తిపోతాయి. ఇదేనా మీ జీవితం ? 60 కోట్ల మంది – చదువురాని యీ మూగ జీవులను ఏమి చేద్దామని మీ నిర్మాతలు యీ మత్తు మందు చల్లుతున్నారు?" అని అడిగారు.

మిగ్యేల్ లిటిన్ (చిలీ నుండి పారిపోయి మెక్సికోలో తల దాచుకొంటున్న దర్శకుడు) సినిమా ప్రయోజనాన్ని గురించి మాట్లాడుతూ "సినీ కెమేరా – నిజం పరిశోధించి కనుగొని నిజాన్ని

మాత్రమే చూస్తుంది. కెమేరా సాంఘిక నిబద్ధతగల దర్శకుని చేతిలో అత్యుత్తమ ఆయుధం. అయితే మీ సినిమాలు వాస్తవాన్ని చూపుతున్నవా, చూడగలుతున్నవా అంటే సమాధానం నేను చెప్పలేను. మీ నుండి సమాధానం రావాలి. ఇకస్వాతంత్రం సంపాదించిందిమీదేశం, సాంస్కృతికంగా-ముఖ్యంగా మీ వెండి తెర, బహుళ జాతి సంస్థల ప్రభావం నుండి విముక్తి సంపాదించాలి" అన్నారు.

ఐనా బెలాస్ (స్వీడిష్ ఫిల్మ్ఇన్స్టిట్యూట్. మన చిత్రాలలో హింస, దౌర్జన్యకాండ ఎక్కువ అని చెపుతూ-"షోలే మాదేశం పంపితే సగం చిత్రాన్ని తెగ కొట్టి అవతల పారేస్తాం. మా దేశంలో 'ఎక్సార్సిస్ట్', 'ఎంటర్‌ది డ్రాగన్', 'ఓమెన్', లాటి హింసా ప్రవృత్తికల చిత్రాలు నిషేధించాం" అన్నారు ఆమె. స్వీడన్‌లో సెక్స్-విచ్చలవిడి లైంగిక దృశ్యాలు తెర మీద చూపడానికి ఎలాటి నిషేధాలు లేవని మనం యీ సందర్భంలో గుర్తుంచుకోవాలి.

మైఖేల్ స్పెన్సర్-(కెనడా) మాట్లాడుతూ సినిమా ప్రయోజనం-ప్రేక్షకుణ్ని 'ఎంటర్ టెయిన్' చేయాలి. 'ఎంటర్ టెయిన్' చేయడం అంటే రంగు రంగుల దృశ్యాలతో, పాటలతో డాన్సులతో మనస్సును ఆకట్టుకోవటం కాదు. కాని ఆలోచింప జేయాలి, అదే నిజమైన సినిమా" అన్నారు.

ప్రేమ్ బస్నియాత్ (నేపాల్ దర్శకుడు) మాట్లాడుతూ "పొరుగు దేశంగానే కాక, సహజంగా సినిమా పరంగావున్న అపారమైన అనుభవం, వనరులదృష్ట్యా మేము మార్గం కోసం భారత దేశం వంక చూస్తాం, భారతదేశం హాలీవుడ్ వంక చూస్తోంది, ఎన్నో శతాబ్దాల మన నాగరికత, సాహితీ సంప్రదాయాలను మరచి పోతున్నాం. ఇలా సాంస్కృతికంగా దూరం కావడం, లేదా సంకరం కావటం వల్లనే ప్రాచీన గ్రీక్, అస్సిరియన్, నైలునదీ నాగరికతలు దెబ్బతిన్నవి. సినిమా ద్వారా మన ఉదాత్త సాంస్కృతిక సంప్రదాయాలను కాపాడుకొందాం" అని విజ్ఞప్తి చేశారు.

ఖలీద్ సిద్ధికి (కువైట్ దర్శకుడు) 10సం. రాల క్రితం మనదేశం వచ్చి చదువుకొని, సినిమాటోగ్రఫీ నేర్చుకొని వెళ్ళాడు. "మా దేశంలో ఈజిప్ట్ నుండి వచ్చే సినిమాలు, బొంబాయి సినిమాలు ఎక్కువమంది చూస్తున్నారు. హాలీవుడ్ మోజునుండి మేము విముక్తి పొందాం. ఈజిప్ట్, బొంబాయిని అనుసరిస్తోంది. బొంబాయి, హాలీవుడ్‌ను అనుసరిస్తోంది. మొత్తంమీద యీ విష వలయాన్ని ఛేదించాలని నాప్రయత్నం. ఎప్పటికైనా బొంబాయిలో సినిమా తీస్తాను. అది మాత్రం "బొంబాయి సినిమా కాదు" అని చెప్పారు.

బెన్‌బార్కా (మొరాకో దర్శకుడు) మాట్లాడుతూ "నిజమైన ప్రజాజీవితాన్ని ప్రతిబింబించే సినిమా గొంతు నులిమి వేస్తున్నారు. హాలీవుడ్ కార్బన్ కాపీ లకు లభ్యమయ్యే ప్రాచుర్యం ప్రభుత్వ ప్రోత్సాహం, 'మరో సినిమాకు' ఆఫ్రికన్ సినిమాకు దొరకటం లేదు" అన్నారు.

సిల్వెస్టన్ సిఝోక్రోవ్‌ను (పోలెండ్ దర్శకుడు) భారతీయ సినిమాలు ఎందుకు ఎక్కువ దిగుమతి చేసుకోరయ్యా అంటే "ఎందుకు చేసుకోం?" సత్యజిత్ రే, మృణాళ్‌సేన్ మొదలైన వారి చిత్రాలు మా టీవీలోనూ విడిగానూ చూపిస్తున్నాం. ఇక మిగిలిన సగటు భారతీయ చిత్రాలు అంటారా - అలాటి చిత్రాలు మా ప్రేక్షకులకు నచ్చవు" అన్నారు.

జెఫ్రీ గాడ్ఫ్రే (న్యూజిలాండ్ దర్శకుడు) తన దేశంలో సినిమా పరిశ్రమ అభివృద్ధి చెందక పోవటానికి కారణం చెపుతూ, "న్యూజిలాండ్‌లో తెల్లవాడు కాలుమోపేసరికి వున్న ఒక్కనాగరికత, ఆదిమవాసుల నాగరికత. దానిని మేము వేటాడి చంపివేశాం. తెల్ల సంస్కృతి వేరూనలేదు. ఉన్న సంస్కృతి తుడిచి పెట్టుకు పోయింది. ఇప్పటి మా సమస్య-తెరమీద ఏ జీవితాన్ని ఏ వాస్తవాన్ని ప్రతిబింబించాలి అన్నది.దయచేసి, న్యూజిలాండ్ లో నేల మీద మేము చేసిన పనిని, ఇక్కడ మీరు తెరమీద చేయకండి" అన్నారు.

అరుణా వాసుదేవ్ సినిమా సెన్సారింగ్ మీద పరిశోధన గ్రంధం వ్రాసి ఫ్రాన్సులో డాక్టరేట్ పొందిన మహిళ. మలేషియా నుండి వచ్చిన సినిమా అతిధులతో మాట్లాడుతూండగా వారు మధ్యలో "మలేషియాలో మా సినిమాలు ఏమి చూశారు?" అని అడిగారట. అందుకు ఆ పెద్ద మనుషులు ముఖం చిన్నపుచ్చుకొని,'క్షమించండి! మేడమ్! మా దేశంలో క్రింది అంతస్తు జనాభా ఒక స్థాయి మర్యాద కల పెద్ద మనుషులు ఎవ్వరూ మీ సినిమాలకు వెళ్ళరు' అని సుతిమెత్తగా సమాధానంచెప్పారట.

ఈ అభిప్రాయాలను అన్నిటినీ-ఒక చోట చేర్చి మీముందు వుంచటం-మన సినిమా కుళ్ళి పోయింది అని చెప్పటానికి కాదు. విదేశాలలో ప్రపంచ చలన చిత్రపటం మీద-ఉన్నత ప్రమాణాలతో నిర్మించిన మన'మరోసినిమా' మనకు ఒక గౌరవనీయమైన స్థానాన్ని కల్పిస్తూ వుంటే-కలకత్తా, బొంబాయి, మద్రాస్ ప్యాక్టరీల నుండి వస్తున్న సరుకు ఎంతటి హానిని ఇటా బయటా కలిగిస్తుందో తెలియజేయటానికే.

న్యూఢిల్లీలో ఏడవ అంతర్జాతీయ చలన చిత్రోత్సవ సందర్భంలో విన బడిన యీ పెద్దల గొంతులు, మన తెలుగుపత్రికలలో కాని, జాతీయ దిన పత్రికలలో కాని, ప్రతిధ్వనించలేదేమి? ఒక అమెరికన్ యువతి గదిలో మరణించిన రెడీమేడ్ దుస్తుల వ్యాపారి. బస్టర్డ్ పక్షుల వేట, డిఫెన్సు కాలనీలో తప్పిపోయిన పసిపాపకు లభించిన ప్రాచుర్యం, ప్రాముఖ్యం - యీ పెద్దల ప్రకటనలకు లభించలేదు.

ఈ చలన చిత్రోత్సవంలో తారలు మిలమిలలు లేవు గ్లామర్‌లేదు, కాంతి లేదు, సెక్స్ లేదు, బూతులేదు, అసలు జనానికి ఉత్సాహం లేదు - అని వాపోయే పత్రికారంగంనుండి ఇంక ఏమి ఆశించగలం ?

ప్రపంచవ్యాపితంగా సినిమా ప్రయోజనాన్ని కాపాడ గల, అభ్యుదయ

(మిగతా 38-వ పేజీలో)

# "కృష్ణదేవరాయ" రూపవాణి

ఏటుకూరి

కేంద్ర ప్రభుత్వ సంగీత నృత్య విభాగం, రాష్ట్ర ప్రభుత్వ సమాచారసాంస్కృతిక శాఖ సహకారంతో "కృష్ణదేవరాయ" రూపవాణి కార్యక్రమాన్ని, హైదరాబాదు పబ్లిక్‌గార్డెన్స్‌లో ప్రదర్శిస్తున్నారు.

నాలుగు ఉన్నత వేదికలపై సుమారు 100 మంది కళాకారులు ఈ ప్రదర్శనలో పాల్గొంటారు. కళాకారులెవ్వరూ మాట్లాడరు. హావభావ అభినయాలు మాత్రం చేస్తారు. అంతకుముందే రికార్డయిన మాటలు, పాటలు, సంగీతం వినిపిస్తాయి. కథానుగుణంగా ఒక వేదిక పైనుండి మరొక వేదిక పైకి, ప్రసరించే ఫ్లడ్‌లైట్స్ కాంతిలో కళాకారుల అభినయాలను ప్రేక్షకులు చూస్తారు. మాటలు, పాటలు వింటారు. ఈ ప్రదర్శన చూస్తూ కొంతసేపు ప్రేక్షకులు 16వ శతాబ్దిలో ఆంధ్ర, కర్ణాటక దేశాల సరిహద్దులలో వెలసిన విజయనగర రాజ్యవైభవంలో లీనమైపోతారు.

సౌండ్+లైట్ కార్యక్రమం మనకు కొత్తకాదు. ఆంధ్రలో, విజయవాడలో, గాంధీహిల్ సొసైటీవారు గాంధీజీ జీవితాన్ని ఈవిధంగా చాలా కాలంగా ప్రదర్శిస్తున్నారు. ఢిల్లీలో రెడ్‌ఫోర్టులో, షాజహాను దర్బారు ప్రదర్శన జరుగుతున్నది. వివిధ రాష్ట్రాలలోనూ ఇలాంటివి ఉన్నాయి. కాగా కళాకారులు ప్రత్యక్షంగా మూకాభినయం చేయటం ఇందులో ప్రత్యేకత. సుప్రసిద్ధ సినీ నటులు జగ్గయ్య, గుమ్మడి, జానకి ఇత్యాదులు ఆయా పాత్రలకు మాటలు వినిపించగా, ఎస్. వరలక్ష్మిలాంటివారు పాటలు వినిపించారు. సంగీతదర్శకత్వం శ్రీ బాలమురళీకృష్ణ. స్క్రిప్టు రచన శ్రీ ఆరుద్ర.

మధ్యయుగాలలో చాలా మంది రాజులున్నారు. కవులను పోషించిన వారూ ఉన్నారు. కాని కృష్ణరాయల వలె స్వయంగా మహాకావ్యాన్ని కూడా రాసిన వారు అరుదు– తంజావూరు పాలించిన రఘునాధనాయకుడు మినహా.

కాని ఈ ప్రదర్శనలో, పెద్దన తిమ్మనాదులను, ఇతర అష్టదిగ్గజాలను ప్రవేశపెట్టిన రచయిత 'ఆముక్తమాల్యద'ను ఎందుకో ప్రస్తావించలేదు. చిన్నమదేవి జీవితంలోని ఒక సంఘటనతో ముడిపడిన పారిజాతాపహరణ కావ్యంలోని పద్యాలను వినిపించారు. మంచిదే. తన 'ఆముక్తమాల్యద'లో కృష్ణదేవరాయల నాటి ప్రజాజీవితం ప్రతిబింబించిన వర్ణనలు కొన్ని చేశారు. అవి వినిపిస్తే ఎంతో బాగుండేది ప్రస్తావనమాత్రంగానైనా, 'ఆముక్తమాల్యద'ను చెప్పక పోవడం లోపమే.

## ...వ రాయ"

## ...జ్ఞాపక ప్రదర్శన

...బలరామమూర్తి

తిరుపతి వెంకటేశ్వర ప్రార్థనతో, మొదలైన ఈకథ తిరిగి వెంకటేశ్వర స్తవంతో అంతమైంది.

భక్తిలాగే అకాలపు జీవితంలో శృంగారం ప్రధానమైనది. కనుక పుష్పలావికలతో సరసాలు, తదితర ఘట్టాలను కూడా అంగీకరించ వచ్చు. కాని కృష్ణరాయలు, తిమ్మరుసుల రాజనీతిని వివరించే సందర్భంలో రచయిత తెలిసో, తెలియకో పెద్ద పొరపాటు చేశారు. "కంటికి నిద్రవట్టునె" అను శ్రీనాథుని పద్యాన్ని ఒకటికి రెండు సార్లు చదివించి, కేవలం వ్యక్తిగత అధికార దర్ప ప్రదర్శనకే కృష్ణరాయలు దండయాత్రలు చేసినట్లు చూపటం, కృష్ణరాయలకు అపచారం చేయటమే.

కృష్ణకు దక్షిణాన ఉన్న ఆంధ్ర ప్రదేశమంతా కృష్ణరాయలు జయించాడు. కర్ణాటక తమిళ దేశాలపైకి సైన్యాలు పంపాడు ఒక సామ్రాజ్యాన్ని స్థాపించాడు. బీజపూ, అహ్మద్‌నగర్ రాజులతో యుద్ధాలు చేసినా, పనిగట్టుకొని ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టలేదు. కృష్ణకు ఎగువన మీరు, దిగువన మేము అనే సూత్రాలన్నీ పాటించాడు. ఈ సూత్రాన్ని కాదని బహమనీరాజ్యాల అంతఃకలహాలలో తలదూర్చిన అళియ రామరాయలు, విజయనగర రాజ్య పతనానికి కారకుడైనాడు. కృష్ణరాయల రాజనీతిలో ఇది మొదటి అంశం.

ఆంధ్ర, కర్ణాటక, తమిళ దేశాల మధ్య పెద్దయెత్తున ప్రజలు అటూ ఇటూ కదలివెళ్ళి స్థిరపడి, అంతర్రాష్ట్రీయ సమన్వయ భావం ఏర్పడటానికి కృష్ణరాయలదండయాత్రలుదోహదం చేశాయి. తంజావూరులో, మధురలలో తెలుగువారి ప్రవేశం, కర్ణాటకలో తెలుగువారి ప్రాభవం ఏర్పడ్డాయి. అలాగే రాయలసీమలోని పెక్కు ప్రాంతాలకు కన్నడిగులు వ్యాపించారు. ఈ సాంస్కృతిక సమన్వయ ధోరణి అప్రయత్నంగానే జరిగినా, రాయలసీమ అభివృద్ధికి పెద్ద ఎత్తున తటాకాల నిర్మాణం ఈ కాలంలోనే జరిగింది. శైవ వైష్ణవ విభేదాల కతీతంగా మతసామరస్యాన్ని కాపాడటం మరొక ముఖ్యాంశం.

ఇందులో ఏ ఒక్క అంశాన్ని రచయిత ప్రస్తావించ లేదు. ముస్లిం అనే పేరు ఎత్తితేనే ప్రమాదమేమో అన్నట్లు రచయిత, తెలంగాణఆంధ్రలను రాయలు ఐక్యపరచినట్లు ఎందుకు పేర్కొన్నారో దురూహ్యం. "మతసామరస్యం ప్రస్తావించటానికి బౌద్ధభిక్షువులను చూపటం "బుద్ధం శరణం గచ్ఛామి"అని పలికించడం హాస్యాస్పదం. బౌద్ధం అంతకుముందే ఏనాడో అంతరించింది. సుప్రసిద్ధ సాహిత్య, చరిత్ర పరిశోధకులైన

శ్రీ ఆరుద్ర, ఈ లోపాలు ఎందుకు చేశారో తెలియదు.

"మా సరిహద్దులను మేము అతిక్రమించము" అని పలికించి, సరిహద్దులంటే ఈనాటివి కాని, ఆనాటివి" అని తిమ్మరుసుచే పలికించటంలో ఏదో అవాంఛనీయమైన ధ్వని, ప్రేక్షకులకు స్ఫురించక పోదు.

ఇలాంటి కొన్ని చారిత్రక అవాస్తవికతలు. విజ్ఞులైన ప్రేక్షకులకు స్ఫురించక పోవు.

తమిళనాడులోనూ ఇలాంటి చిత్రీకరణను చేసినట్లు, కాగా అక్కడ ఏ రాజేంద్ర చోళుని గాధనుగాక, "సుబ్రహ్మణ్య భారతి" జీవిత విశేషాలను రూపవాటిలో పొందు పరచినట్లు తెలుస్తున్నది.

మరి తెలుగులో, రాచరికపు గాధను ఎందుకు ఎన్నుకున్నారో? అందునా ఆనాటి రాజనీతికి సరియైన వ్యాఖ్యానమివ్వక, ఈ వక్రీకరణలు ఎందుకు వచ్చాయి? ఈ ప్రశ్నలకు ప్రభుత్వ బాధ్యులు సమాధానం ఇవ్వవలసి ఉంటుంది.

ఆధునికయుగ లక్షణాలైన లౌకిక, ప్రజాస్వామ్య లక్ష్యాలకు చేరువలో ఉన్న వేమన జీవితాన్ని ఎన్నుకుంటే బాగుండేది. ఇటువంటి కార్యక్రమాల నిర్మాతలు, ప్రజలు పరిశీలించవలసిన అంశం ఇది.

# నీ ముందు నేడు

హర

ఆగామి చాలా ఆలస్యం
ఇవ్వాళే జీవించు!
'నిన్న' ఎన్నడో గతించింది
'గతం' కొరకు చింత తీరని వంత,
నేస్తం!
బతుకు పుటలు నేర్పిన చదువు
అంతరంగ సంస్కారంతో జోడించు
జీవన పథ పాంథునివై
యాత్ర సాగించు!
వెనక్కి తిరిగి చూడకు-
ముందు అంచనాలతో
నేటి ప్రయాణం మాత్రం ఆపకు
నేస్తం!

ఆగామి చాలా ఆలస్యం!
కనుక, ఇవ్వాళే జీవించు.
స్వార్థపు చీకట్లు, బాధల ముళ్ళు
సాంత్వన లేని హృదయావేదన
వెనక్కి తీసుకోలేని కాలం,
నేస్తం-భయపెడుతున్నాయానిన్ను?
అయోమయాలు, సందిగ్ధాలన్నీ వదిలి
'జీవించడమ'నే నైజాన్ని
నిలుపుకుని
ఈ క్షణమే, ఇప్పుడే, ఇవ్వాళే జీవించు
ఆగామి చాలా ఆలస్యం!
అందాకా వృథాయాపన ఎందుకు?
పద, పద—మునుముందుకు.

# దేవుడు చేయని మనుషులు

జి. సి. జీవి

"స్వామీ!"

"ఏమి? ఇంకా ఏమైనా వరాలు కావాలా?"

"అమ్మమ్మ! ఎంతమాట! తమరి దగ్గర కోరవలసినవి నా కింకేమున్నాయి స్వామి! నన్ను మంత్రిని చేస్తిరి. విమాన ప్రమాదం లోంచి నన్ను కాపాడితిరి. మా అబ్బాయిలకి ప్రభుత్వ యంత్రాంగంలో పెద్ద పెద్ద పదవు లిప్పిస్తిరి. మా అల్లుళ్ళకి ఇంపోర్టు లైసెన్సులు మంజూరు చేయిస్తిరి. మా ఆవిడ్ని సెన్సారు బోర్డు మెంబర్ని చేస్తిరి."

"నీకు మనవలూ, మనవరాళ్ళూ లేరా?"

"ఎందుకు లేరు స్వామీ. అంతా కలిసి ఓ డజనుకు పైగానే వున్నారు"

"అయితే వాళ్ళు పెరిగి పెద్దయ్యాక వాళ్ళకి కావాల్సిన పదవులూ, పెళ్ళాలూ మొగుళ్ళూ వుద్యోగాలూ వగైరా వగై రాలకి నా అవసరం లేదా? ఆ వరాలని ఇప్పుడే రిజర్వు చేసి పెట్టుకోవాలని నీకు తోచలేదా?"

"మీరు మరోలా అనుకోకుంటే...'

"ఫరవాలేదు. చెప్పు"

"కొంత కాలంగా ప్రజలకి మీ మీద నమ్మకం సడలిపోతోంది స్వామీ. మీ వునికినే ప్రశ్నిస్తున్నారు. ఇక రానున్న కాలంలో మీ అవసరమే వుంత దంటున్నారు.'

"ఎవడా కూసేది?"

"ఇంకెవరు స్వామీ! సైంటిస్టులు, రేషనలిస్టులు, మార్కిస్టులూ వీళ్ళే"

ఈ ప్రపంచాన్ని సృష్టించింది నేనే నని కూడా నమ్మటం లేదా వీళ్ళు?"

"లేదు స్వామీ. అదేదో "బిగ్ బ్యాంగ్ థీరి" అట.

ఈ విశ్వ మంతా మొదట్లో ఒకచిన్న బిందువుగా వుండేదిట. అది పగిలి, వ్యాకోచించి ఈ విశ్వాంతరాళం ఏర్ప డిందని ఏదో చెబుతున్నారు"

"పోనీ ఆ బిందువుని ఎవరు సృష్టిం చారుట?"

"అదే పుట్టిందట"

"ఏడిశారు"

"ఇంకా కొందరు ఏమనంటున్నా రంటే స్వామీ- "ఈ ప్రపంచాన్ని సృష్టించింది దేవుడే అనుకో. అయితే ఏం-వాడితో నాకేం పని?' అంటు న్నారు స్వామీ"

"అంటే వాళ్ళ వుద్దేశం?"

'ఈ భూమ్మీద ఇంత మంది పేద వాళ్ళని, పతితుల్ని, భ్రష్టుల్ని, బాధా సర్పదష్టుల్ని తాడితుల్ని, పీడితుల్ని, సృష్టించి చూస్తూ వూరుకున్న వాడూ

ఒక దేవుడేనా? ఏదీ కపినించమను. చీల్చి చెండాడుతాం" అంటున్నారు స్వామీ"

"ఇది మరీ బాగుంది; నేనేం పిచ్చోడ్నా. ఈ బీదాబిక్కీ జనాన్ని సృష్టించటానిక్కా? అసలు వీళ్ళు నాకేం ఒరగబెడతారని పనిగట్టుకుని వీళ్ళను సృష్టిస్తాను. వీళ్ళు నాకేమైనా పూజలూ పునస్కారాలూ చేయగలరా? కానుక లివ్వగలరా, కళ్యాణాలు చేయించగలరా? పట్టు పీతాంబరాలివ్వగలరా? పంచభక్ష్య పరమాన్నాలు నైవేద్యాలు పెట్టగలరా? బంగారు తొడుగుతో గోపురాలు కట్టింప గలరా? వీళ్ళు నాకేమివ్వగలరని పని గట్టుకొని వీళ్ళని సృష్టిస్తాను?

ఇ తకీ తమరు ?

'అవునయ్యా! ఈ గోచిపాత రాయు ళ్ళని నేను సృష్టించలేదు. వీళ్ళకీ నాకూ ఎటువంటి సంబంధమూ లేదు. ఈ మాటే చెప్పు ఈసారి మీ వాళ్ళందరి తోటీ."

"చిత్తం"

---

(33-వ పేజీ తరువాయి)

దృక్పథం గల దర్శకులు 'ఇంటర్ నేషనల్ ఫిల్మ్ డైరెక్టర్స్ ఫోరమ్' మేరకు ఒక తాటి మీదకు వచ్చారు. ఓస్మాన్, సెంబేన్, లిట్టెన్, రే. మృణాల్, బాసు ఛటర్జీ మొదలైన పెద్ద లందరూ దీనికి తుది రూపమిస్తున్నారు.

ఇప్పుడు చలన చిత్ర స్వరూపం మారాలి. ఈ ఉద్యమానికి జనత అం దించే సహకారంమీదనే - ఈ మార్పు- ఈ విప్లవం ఆధారపడి వుంటాయి.

# హిప్పీలు !

పులిచేరి రామమోహనరావు

ఊర్వశి శాపాన్ని
ఇంద్రుని సవరణ ద్వారా
వరంగా వాడుకున్న వాడై,
అజ్ఞాత వాసానంతరం
బృహన్నల వేషాన్ని విసర్జిస్తూ
అంతఃపుర ప్రవేశానికి
అయాచితంగా లభించిన
ప్యాస్‌పోర్టులాంటి వేషాన్ని
ఆపదలో ఆదుకున్న నేస్తాన్ని
అంతలోనే వీడవలసి రావడంతో
పార్థుడు మనస్సులో
కించిత్ బాధపడ్డాడట!
అర్జునుని ఆవేదనను
పరమాత్మ పసిగట్టి
"అర్జునా! ఇరవైయో శతాబ్దంలో
పలాయన వాదంలో
పరాకాష్టనందుకున్న
యువతీ యువకులు
ఆడా మగా తేడా తెలియని విధంగా
హిప్పీలై మసలుతారు!
అనాడు, నీ ఈ వేషానికి
సార్వజనీనత లభిస్తుంది;
ఊరడిల్లు మన్నాడట.
అన్నా ! ఈ మార్పు
మన తరానికి వరమా ?
రానున్నది
మరో కురుక్షేత్ర సమరమా ?

కథానిక

# పౌరుడు చచ్చిపోయాడు

వి. కె. విశ్వనాథ శర్మ

నా ఇరవై ఒకటో సంవత్సరం పొల్లారా నిండగానే నాకు సంక్రమించిన హక్కు - ఓటు హక్కు - అడల్ట్ ఫ్రాంచైజ్।

బిడ్డల కోసం గొడ్రాళ్లా, ఈ హక్కు కోసం నేను తపించేను. అందుక్కారణం - దేశ రాజకీయాలు రోజురోజుకి అధ్వాన్నంగా మారి నాలో అగ్ని జ్వాలలుగా మారటం.

—పదవుల కోసం 'పెదాల' సేవ చేసి, అవి దక్కిన క్షణం నుంచీ స్వార్థ బుద్ధులయిన 'శ్వేత వస్త్రధారులు' నా గుండెల్ని పిండటం.

—దేశ శ్రేయస్సుకు పాటు పడవలసిన ప్రజా ప్రతినిధులు వ్యక్తిగత కలహాలతో కర్తవ్యాన్ని కాలదన్నటం.

—అన్నిటినీ మించి, ఓటు ముక్కకున్న విలువ తెలుసుకోక, గుడ్డెద్దు చేలో పడ్డట్టు ముద్రకొట్టి చేతులు దులుపుకునే ఓటరును చూపి నాలో వున్న 'అసలు' భారత పౌరుడు విలవిల్లాడి పోయేడు.

నేను గాక, మాఇంట్లో పోయిన పది సంవత్సరాల మంచి వయోజనులుగా చెలామణీ అవుతున్న అమ్మ నాన్న, అన్నయ్యలిద్దరు—

"మీ రొఠ్ఠి దద్దమ్మలు. ఏళ్ళురాగానే సరికాదు హక్కులు రాగానే అయిపోలేదు. మీ హక్కుకున్న విలువ ఏనాడైనా తెలుసుకోవటానికి ప్రయత్నించేరా? మీకేమైనా విచక్షణా జ్ఞానం వుందా? 'ఓటు వేశామంటే వేశాము. ఏదో భోజనం చేశావా అంటే చేశాము" అన్నట్టు. భోజనం చేసేటప్పుడు కూడా ఆలోచిస్తాం-ఏం తినాలీ? ఎంత తినాలీ? ఏం తినకూడదూ? తినకూడనివి తింటే కలిగే నష్టమేమిటీ? అని. 'అలాకాదు! ఆకలి అణిచేందుకు కావాల్సింది తిండి. కష్టకాలంలో 'గడ్డి' తినైనా బతకాలి" అంటే అనొచ్చు. కానీ, ఇది ఓటు. పక్షపాతం లేకుండా కులమత విచక్షణ లేకుండా, ఏ ఆకలికి లొంగకుండా స్వతంత్రంగా నిర్భయంగా రేపు నిన్నేలబోయే 'రాజు'ను ఎన్నుకునేందుకు రాజ్యాంగం యిచ్చిన "దివ్విటీ"అంటూ ప్రతిసారి ఎన్నికలకి మా వాళ్ళని హెచ్చరిస్తూ వచ్చాను.

కానీ, నాది ఒక రాజకీయ నాయకుడి వుపన్యాసంలా కొట్టి పారేసారు మా

వాళ్ళు చచ్చు వెధవల్ని ఎన్నుకుని చప్పట్లు కొట్టేరు. ఆ చచ్చు వెధవలే తర్వాత తర్వాత చెరణాకోళ్ళు ఝుళి పించి జీవన ప్రమాణపు వెన్నుమీద వాతలు పెడుతుంటే నిస్సహాయంగా వణికిపోయారు.

వాళ్ళ స్థితి చూసి నాకు నవ్వొచ్చింది జాలేసింది. కోపం లేచింది. ఆవేశం పుట్టింది.

నా పందొమ్మిదో ఏట పుట్టిన ఆ ఆవేశం ఇరవై ఒకటవ ఏటగానీ వుధృత రూపం దాల్చలేదు.

ఓటర్ల లిస్టులో నాపేరు ఎక్కిన తర్వాత నా పుట్టిన రోజు పండుగ జరుపుకున్నాను.

'ఇక నాకు తెలుసు. నా దేశ ఏలు బడి ఎవరి చేతుల్లో పెట్టాలో నాకు తెలుసు. నా ఓటు హక్కును సద్వి నియోగ పరుస్తాను. ధృవతారలాంటి నేతను ఎన్నుకుని అభివృద్ధి పధంలోకి సాగిపోతాను' అని వుప్పొంగిపోయాను.

పాలక వర్గంలో అంతః కలహాల వల్లనే గానీ, ప్రతి పక్షాలన్నీ పటిష్ట మవ్వటం వల్లనే గానీ, నాకు ఓటు హక్కు సంక్రమించటం వల్లనేగానీ ప్రస్తుత ప్రభుత్వం కూలిపోయింది మధ్యంతర ఎన్నికలు వచ్చేసాయి. ఎన్నికల సంరంభం ఆకాశమెత్తున సాగుతోంది.

నేను-చెదపుట్టల్లాంటి పార్టీల 'మాని ఫెస్టో' లన్నీ చదివేను. అభ్యర్థి వ్యక్తి గత జీవితం, వ్యక్తిత్వ సామర్థ్యం బాగా చదివేను.

ఎన్నికల ప్రచారాలు ఇవాళ్ళతో సమాప్తం.

రేపు లేదు ఎల్లుండే ఎన్నికలు—

x x x

మొన్నటికి ఎల్లుండి ఇవాళే-పోలింగు ఇవాళే.

—మా ఇంట్లో వాళ్ళలాగాక, ఏ వాహనం సహాయం లేకుండానే పోలింగు కేంద్రానికి చేరుకున్నాను. ఎక్కువ రద్దీ లేదు.

వూరట్లాడుతూ నా పేరు చెప్పేను.

లిస్టంతా ఒకటి నాలుగు సార్లు వెతు కుతూ మధ్య మధ్య నా పేరడుగుతూ అన్నాడక్కడి అధికారి "మాస్టారు మీ పేరిక్కడ లేదే. వేరే వార్డుల్లో చూడండి"—

కాళ్ళీడ్చుకుంటూ పక్క వార్డు కెళ్ళేను—

నా పేరు లేదు

ఇంకోటి ... ఇంకోటి ...

సాయంత్రం దాకా తిరిగి తిరిగి విసిగెత్తి పోయింది. నా అసలు వార్డు కొచ్చి అక్కడి అధికార్లతో పోట్లా డినా లాభం లేకపోయింది.

ఇంటి కెళ్ళి అన్నయ్యలతో విష యంచెప్పేను.

వాళ్ళు నవ్వి అన్నారు—"నీ కన్నా మేమే నయం మా ఓట్లు ఎవరో వేసి పారేశారు. మేం వెళ్ళేసరికి. నీ పేరే ఎత్తేశారన్నమాట."

అంతే!

నాలో వున్న స్వతంత్ర భారత పౌరుడు చచ్చిపోయాడు.

# మానవుడు

కథానిక

శ్రీమతి బెహరా సాహితి

జ్ఞానేశ్వరరావుకి బళ్లకొద్దీ బాధలు; ఓపలేని కష్టాలు, ఆపలేనిదుఃఖాలు అణచలేని సమస్యలు, అణగార్చేస్తున్న దరిద్రం. అన్నీ యింకా ఎన్నో అతని జీవితాన్ని బహుదుర్భరం చేశాయి. ఒకానొక చెడు (మంచి) ముహూర్తం చూసుకుని అతడడవికి పరిగెత్తాడు, పీఠం వేశాడు, హఠం పట్టాడు, మహనిష్ఠగా సాగించాడు తపం.

"ఏమైనా సరే, సాధించాలి. ఆ దేవుడ్ని భూమికి దించాలి, అతగాడి చిటికిన వేలు పట్టుకుని ఈ సంసార జలధిని. దాటాలి అబ్బఅబ్బ అమ్మ బాబోయ్! ఒకటా, రెండా ఎన్ని సమస్యలు,ఎన్నికిష్టాలు, హోరిభగవంతుడా అడగాలి ఐశ్వర్యాలు, కోరాలి కోటి కోట్లు, పొందాలి పొందు రంభా ద్యప్స రసల మించిన కనకలతని. సంఘంలో పరువు, ప్రతిష్ఠ ఐశ్వర్యం, హోదా, సుఖాలు అమర సుఖాలు అన్నీపొందాలి, పొంది తీరాలి, ఎన్నేళ్ళు గడిచినీ, ఏమైపోనీ ఈ పట్టు వదులుతానా. చూస్తాను? "ఎలా ప్రత్యక్షం కాడో చూస్తాను." ఇదే అతని అకుంఠిత దీక్ష భక్తిమాటనే చెప్పలేను గాని ఓర్పులో అతను భగీరథుడే అయ్యాడు, నిరీక్షించాడు శబరి కంటె ఎక్కువగా.

లెక్కెందుకుగాని గడిచా యెన్నో వత్సరాలు.

"వత్సా!"

కళ్ళు తెరిచే సరికి ఎదురుగా, చిరునవ్వుతో దేవుడు.

సాష్టాంగ పడాలన్న సభ్యతని మరచిపోయాడు. చేతులు జోడిద్దామంటే చైతన్య రహితుడే అయ్యాడు ఓ క్షణం సేపు, నోరారా కీర్తిద్దామంటే పెదవులు ఆడాయికాదు, అతని సర్వాంగాల్లోనూ, హృదయం లోలోతులలోనూ ఒక్కటే వినపడుతోంది. "అబ్బ! ఎన్నాళ్లకి! ఎంత కష్టపడి సాధించాను! ఎన్ని సంవత్సరాలు గడిచాయో! అవి తరసాధ్యమైన పని అమూల్యకాలాన్ని వెచ్చించి అలనాటి మునుల కోవన నిలబడగలంతటి మహత్కార్యం".

అతనికి గడచినకాలం మహాదీర్ఘమై కంటికి కనుపించ నంతదూరం సాగిపోయింది. తను పడిన కష్టం మహార్ణవమంత, మరి యింత కష్టపడి ఇంత శ్రమపడి....

"ఏమిటి నాయనా నీ కోరిక"

మృదువుగా నవ్వుతూ అడిగాడుదేవుడు.

బుర్ర గోక్కున్నాడు, భక్తుడు "అదే స్వామీతెలియటంలేదు, ఏమడగాలా అని ఆలోచిస్తున్నాను,ఎందుకంటేఎంత శ్రమకోర్చి నీ దర్శనం పొందానో నీకు తెలుసు! మనిషినే గాని రాక్షస ప్రయత్నం చేశాను. ఇంతా కష్టపడి, ప్రపంచంలో ఎవరూ పొందలేని అపూర్వమైన

నీ దర్శనమూ పొంది నువ్విప్పుడు వర మిస్తానంటే ఏం కోరుకోవాలో తెలియ టం లేదు. కోరేది మళ్లీ అలాటిలాటి అలగా వరం కోరుకోకూడదు గదా! ఇంత దివ్యమైన అవకాశం వచ్చినపుడు బ్రహ్మాండమైన వరమే కోరుకోవాలి నిన్ను. అదే ఆలోచిస్తున్నాను ఏం కోరనా "అని" అన్నాడు. ఆలోచన ఎంతకీ తెగటం లేదు. నిలబడేవున్నాడు దేవుడు. "కాసేపు కూర్చోండి స్వామీ! కాళ్ళు పీకుతాయేమో" అన్నాడు.

"ఫర్వాలేదులే! పడుకుని పడుకుని వీపు పట్టేసింది".

ఆలోచించాడు ఆలోచించాడు, మహా ఆలోచన. ఎంతకీ తెమలటం లేదు. అపూర్వమైన వరం! ఏదీ అతని దృష్టికి ఆనటం లేదు.

"నువ్వు ఎన్నాళ్ళు తపస్సుచేశావో అన్నాళ్ళు ఆలోచిస్తావు కాబోసు!" కొంటెగా నవ్వాడు దేవుడు.

"అబ్బె బ్బే !" అని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"పోనీ, ఓ పని చెయ్యి?"

"ఏమిటి స్వామీ?"

"నీకు పది సంవత్సరాలు టైమిస్తాను. ఆ తర్వాత కోరుకో నీకేం కావాలో!"

"మరి అంతవరకు తమరు".

"నాకెంత! ఆకాలం నాకు రెండు నిముషాలతో సమానం. ఇక్కడేకాసేపు పచార్లు చేస్తాను. నువెళ్ళిరా!".

"ఎంత దయస్వామీ నీకు! మరి నేవెళ్లొస్తాను. నేను సాధించలేనిదీ, ఏనాటికీ పొందలేనిదీ మహాద్భుతమైన వరమొకటి కోరుకుంటాను. వస్తాను స్వామీ. నేనిక్కడే మళ్ళీ నిన్నుకలుసు కోడం". పరిగెత్తాడు అడవుల్లోంచి.

గడిచాయి పది సంవత్సరాలు.

జ్ఞానేశ్వరరావు వచ్చాడు అదే స్థలానికి. అతని ముఖంలో దైన్యం. సంశయం, బాధ, భయం ఏమీ లేవు. ఆకారం చూస్తే రాజవరి కొడుకన్నంత ధీమా కనబడుతోంది. వేషంకుబేరుడి తమ్ముడిలా వున్నాడు.

"ఏవయ్యా, ఏం వరం కావాలి?"

ఆత్రుతగా పల్కరించాడు దేవుడు.

చిరునవ్వినవ్వి. స్థిరంగా, నిదానంగా చెప్పడం మొదలెట్టాడు జ్ఞానేశ్వరరావు "కోటీశ్వరుడినవాలని కోరదామను కున్నాను స్వామీ. సిగ్గు-లజ్జ, దయదాక్షిణ్యం-పాపం పుణ్యం ఇవి వదిలేసి చూశాను. అఖండైశ్వరం నాకు సంప్రాప్తించింది. శరీరాన్ని వంచాను. అతి నిద్ర, అమిత భోజనం వదిలేశాను ఉక్కు కడ్డీలా వుంది నా శరీర మిప్పుడు. చింతలు, వంతలు నన్ను చేరకుండా అంతదూరంలో అట్టే పెట్టాను. నవ్వుతూ వుండగలను. నాలుగు కాలాలపాటు మనగలను. వినయం! ఏకాగ్రత అలవర్చుకున్నాను. జ్ఞాన సముపార్జనకి అవిఎంత అవసరమో తెలిసింది. రేపు మరో గ్రహయానం మేము చేస్తే, అందులో నా చేయి కూడా వుందన్న సంగతి నీకు వినయంగా మనవిచేస్తున్నాను ఇంత ఎదగ డానికి పట్టుదల, కృషికారణం. ఇంతకీ

చెప్పొచ్చేదేమిటంటే నేనిప్పుడు నిన్నేమి కోరుదామనుకున్నానో అన్నీ సాధించాను. మరి."

దేవుడు చటుక్కున అడ్డొచ్చాడు.

"పోనీ చావులేకుండా వరమివ్వనా?"

పకపక నవ్వాడు జ్ఞానేశ్వరరావు.

"చెప్పాగా స్వామీ, చాలావరకు అది నాచేతిలో వుంది. అంతగా మరణం వస్తే రానీ మరీ అలాచావులేక వుండిపోవాలంటే బోర్ కదూ!"

"పోనీ జన్మరాహిత్యం"

"అదసలే వద్దు స్వామీ, మళ్ళీమళ్ళీ పుడతాను కష్టం-సుఖం అన్నీ అనుభవిస్తాను. ఏమీలేకుండా ఎక్కడో పడుండటం ఏంబాగుంటుంది స్వామీ!"

"పోనీ ఆత్మజ్ఞానం ఉప .."

"అంత పెద్ద మాటెందుకు స్వామీ, తెల్సుకుని నేనేం చేస్తాను? మరొకడికి చెప్దామన్నా, అర్థం చేసుకునే వాడెవడూ ఈ భూప్రపంచంలో లేడు సాటివాడి ఉన్నతికి పనికిరాని జ్ఞానం. నాకెందుకు ప్రభూ."

"అయితే ఏమంటావు?"

సారీ! సో సారీ స్వామీ నిన్ను రప్పించడమే గాక, ఇక్కడ వెయిట్ చేసేట్టు చేశాను, క్షమించు, నిన్ను కోరదగ్గ వరమేదీ నాకు కనిపించలేదు."

ఆశ్చర్యంగా ఓ నిముషం చూసి, ఆ తర్వాత పెద్దగా నవ్వడం మొదలెట్టాడు దేవుడు. ఆ నవ్వులో సంతోషం, తృప్తి కనిపించాయి.

"మరి నే వెళ్ళిరానా? నవ్వుతూనే అడిగాడు.

"అవశ్యం, మీకు శ్రమ యిచ్చినందుకు క్షమించు." అని మరోసారి క్షమాపణ, వేడుకుని, వెళ్లాడు జ్ఞానేశ్వరరావు.

దేవుడు గారి దేవేరి విభ్రాంత పోతూ అడిగింది.

"ఏమిటా నవ్వు దేవదేవా?" అని.

"సంతోషం, దేవీ సంతోషం" అన్నాడు.

ఎందుకని స్వామీ అంత సంతోషం ఈ మధ్యకాలంలో నేనెప్పుడూ చూసెరుగనే" అంది కళ్ళు విప్పార్చి చూస్తూ.

"అదా! ఎందుకింత సంతోషమంటే నేనివాళ ఒక మానవుడిని చూశాను దేవీ ఒక నిజమైన మానవుడిని!" అన్నాడు ఇంకా నవ్వుతూనే.

# కోర్టు విచారణ*



## ఆనంద వాసుదేవన్

జార్జి థాంప్సన్, బులవాయోలో నివసించే ఒక ప్రముఖ యూరపియన్. ఆయన చాల ధనవంతుడు; ఎన్నో వ్యాపారా లున్నవాడు; అపారమైన పొగాకు తోటలకు అధిపతి తన మత మన్నా, తన జాతి అన్నా ఆయనకు ప్రాణం. ధనాన్ని ఖర్చుచేయడంలోను, యితరుల్ని సేవించడంలోను ఆయన బహు ఉదారుడు. బృందగానాల్లో ఆయనకు ఆయనే సాటి ఆయనంత శ్రావ్యంగా పాడగలవారు రొడీషియాలోనే లేరంటారు. దేశం మొత్తంమీద ఆయనంత సరసుడు లేనేలేడు. ఆయన కొక బ్రహ్మాండమైన ఆయుధాగారం కూడా ఉంది.

ఆయనంటూ ఉంటారు: "ఈ నాటు జనాన్నెప్పుడూ నమ్మకూడదు; సరిహద్దుకు అతి దగ్గరలోనే ఉంటారు, అకమ్యూనిస్టుగాళ్ళు."

అయితే, నల్లవాళ్ళవల్ల థాంప్సన్‌కి ఎప్పుడూ యిబ్బంది కలగలేదు. కారణమేమంటే, వాళ్ళనెలా మచ్చిక చేసుకోవాలో ఆయనకు తెలిసినంత బాగా మరెవరికీ తెలియదు.

"అసలు, దొర ఎవరో వాళ్ళు తెలుసుకొనేటట్లు చెయ్యి." అంటారాయన పెద్ద గొంతుతో. "అప్పుడన్నీ వాటంతట అవే సర్దుకుంటాయి అప్పుడు కొరడా అవసరమే ఉండదు. నేను గత మూడేళ్ళలో ఒక్క నల్లవాణ్ణైనా నా చేత్తో హింసించలేదంటే మీరు నమ్ముతారా? మెమ్మెమ్మేలూ, పెప్పెప్పేలూ, నీ కసహ్యమని వాళ్ళ కర్థమయేలా చెయ్యి. కాస్త సందేహించావో, నీ పని క్లోజ్"।

ఇవీ, థాంప్సన్ నమ్మకాలు

ఒక చక్కని స్త్రీని ఆయన పెండ్లాడాడు. వారి కొక కొడుకూ, ఒక కూతురూను. కొడుకు ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్నాడు. కూతురికి పెండ్లి నిశ్చయమైంది. ఆయన పార్లమెంటు సభ్యుడు కాకపోయినా, ఎన్నికలలో స్తే ఆయన మాటే చెల్లుతుంది.

---

* రొడీషియాలో న్యాయస్థానాలు నీగ్రోలకు ప్రసాదిస్తున్న న్యాయం ఏపాటిదో చిత్రించే చక్కని కథ సౌందర్య స్ఫూరణ లేని మరొక రచయిత దీన్ని పేలవమైన ఒక ప్రచార సాధనంగా తయారు చేయగలడు.

ఇట్టి వ్యక్తిమీద వచ్చింది, ఒక అభియోగం. ఈయ నొకరోజున నిర్లక్ష్యంగా వ్యవహరించడంవల్ల ఒక నీగ్రో పిల్లవాడు చనిపోయాడు. వాడు తన యింట్లో పనిచేసేవాడే.

నేను న్యాయాధికారిని గనుక, యిది నా ముందు విచారణ కొచ్చింది. కాని, విచారణకు చాలా రోజులు ముందు యిది ఒక విపరీత పద్ధతిలో నా దృష్టి కొచ్చింది. ఒకరోజు ఉదయం కోర్టు బయట పెద్ద గలభా జరుగుతోంది. చాల మంది నీగ్రోలు రోడ్డుమీద మూగి, పెడబొబ్బలు వేస్తున్నారు. నేను కోర్టు భద్రతా దళానికి చెందిన సార్జంట్ ఫాలన్‌ని పిలిచి, సంగతేమిటో తెలుసుకొని రమ్మన్నాను. అతను బయటికెళ్ళి, కాస్సేపయాక తిరిగివచ్చి, యిలా అన్నాడు:

"వాళ్ళు థాంప్సన్‌గారిని గురించి ఏలినవారితో ఏదో మనవి చేయాలను కొంటున్నారండి "

నేను, వాళ్ళలో ఒక వ్యక్తిని తీసుకు రమ్మన్నాను. స్వహిలీ భాషను అనువదించగల మరొకవినికూడా తెమ్మన్నాను.

ఒక మధ్యవయస్కురాలు గుంపులో నుంచి కోర్టులోకి వచ్చింది. తాను వితంతువు ననీ, థాంప్సన్ మూలంగా మరణించినట్లు చెప్పబడే నీగ్రో బాలుని తల్లిననీ చెప్పింది.

"ఈమె నాతో ఏమి చెప్పదలచు కొంది?" అని నే నడిగాను.

"తన కొడుకు థాంప్సన్‌చే చంపబడ్డాడని ఈమె అంటోంది. వాని శరీరం తనకు యివ్వలే దంటూంది."

"కాని, యీ విషయంలో నే నివ్వ దేమి చేయగలను? పోలీసువద్దకు వెళ్ళమని ఆమెతో చెప్పు."

"తా నిదివరకే పోలీసుకు ఫిర్యాదు చేశానంటూంది. కాని, వాళ్ళేమీ చేయలేదట."

"ఎందుచేత? తన కొడుకు హత్య చేయబడ్డాడని యీమె అనుకొంటూందా?"

"థాంప్సన్ లోగిట్లోనే పనిచేస్తున్న యింకో పిల్లవాడు ఈమెతో చెప్పాడట - ఆ యజమాని జోసెఫ్ పట్ల ఉగ్రుడై పొలికేకలు పెట్టేడట; లోపలికెళ్ళి తుపాకి తెచ్చేడట; జోసెఫ్ పారిపోడానికి ప్రయత్నించాడట; కాని తుపాకి గుండుకు చనిపోయాడట."

"ఇదంతా నమ్మడానికి వీల్లేకుండా వుంది. అయితేనేం, ఫరవాలేదు నేనిది విచారిస్తానని ఆమెతో చెప్పండి, ఇక ఆమె వెళ్ళిపోవచ్చు."

ఆ సాయంత్రం నేను పోలీసు సూపరింటెండెంటు బ్రౌన్‌ని నా దగ్గరకు రమ్మని ఫోన్ చేశాను. ఆయన వచ్చారు. తాను తెలుసుకున్న భోగట్టా చెప్పారు.

"ఇదంతా కమ్యూనిస్టుగాళ్ళ గొడవండీ. వాళ్ళు థాంప్సన్ నెత్తురు చూడాలనుకుంటున్నారు. ఆయనను గురించి నీచాతినీచమైన వదంతులు సృష్టించారు. అవన్నీ మీరు విన్నవే గదండీ. నీగ్రో వాణ్ణి ఆయన దారుణంగా హత్యచేశారని పీళ్ళంటున్నారు.

"అసలు, ఏమి జరిగిందని మీ అభిప్రాయం?"

"అది ప్రమాదవశాత్తు జరిగిన ఘటన. ఒకరోజున థాంప్సన్‌గారు తన

రై ఫిళ్ళలో ఒకటి పైకితీసి శుభ్రపరుస్తున్నారు. అందులో తూటాలున్నాయని ఆయనకు తెలియదు. చేతిలో నుంచి గుండు దూసుకెళ్ళి కుర్రవెధవ వీపుకి తగిలింది. వెంటనే థాంప్సన్‌గారు వాణ్ణి తన కారులో ఎక్కించుకొని ఆసుపత్రికి తీసుకెళ్ళారు. నిజానికాయన యూరపియన్ల ఆసుపత్రికి తీసుకెళ్ళారు. అక్కడ వానికి చాలా బాగా చికిత్స చేస్తారని అలా చేశారు. కాని, ఉపయోగం లేక పోయింది. అక్కడికి వెళ్ళిన వెంటనే పిల్లవాడు చచ్చిపోయాడు."

"వాని శరీరాన్ని బంధువుల కియ్యలేదనే మాట నిజమేనా?"

"నిజమేనండి. నేను మీకు చెప్పినట్లు, అది యూరపియన్ల ఆసుపత్రి. మొదటి విషయమేమంటే, అక్కడొక నీగ్రోకు చికిత్స చేయడం పెద్ద పొరపాటు. వాళ్ళక్కడ మృతదేహాన్ని అట్టే పెట్ట లేదు. అలాచేస్తే కొత్త యిబ్బంది లొచ్చిపడతాయి. బంధువుల విషయమంటారా, వాళ్ళెవరూ అక్కడ కనిపించలేదు. అందుచేత మృతదేహాన్ని బయటికి తీసుకెళ్ళి పూడ్చిపెట్టారు."

నేనన్నాను: "ఇది నాకు సంబంధించింది కాదనుకొండి, బ్రౌన్‌గారూ. అయినా, నేనొక మిత్రునిగా మాట్లాడుతున్నాను. మీరు ఏ చర్యా తీసుకోక పోతే, ఒక దొమ్మి జరిగి యుండేది. అలాకాక, ఏదో ఒక చర్య తీసుకుంటే ఏమైయుండేదంటారు? మహా అయితే, థాంప్సన్ కొంత నష్టపరిహారం చెల్లించ వలసి వచ్చేది. అలా చేసియుండవలసిందని మీరనుకోడం లేదా?"

ఆ విధంగా ఆ కేసు నా కోర్టుముందుకొచ్చింది. విచారణ కొద్దినెలల తర్వాత ప్రారంభమయింది. థాంప్సన్ ఒక ప్రమాదకరమైన ఆయుధాన్ని నిర్లక్ష్యంగా పట్టుకోవడంవల్ల ఒక నీగ్రో చనిపోయాడనేది ఆయనమీద అభియోగం. సమర్థుడైన సర్ ఛార్లెస్ బ్రింటన్ ప్రాసిక్యూషన్ నడిపారు (మరుసటి సంవత్సరం, ఘనతవహించిన మహారాణి జన్మదినోత్సవం నాడు ఆయన సర్ ఛార్లెస్ అయారు). కాని, కమ్యూనిస్టుగాళ్ళు అక్కడి విషయాలతో అసంతృప్తి చెంది, తల్లి తరఫున వాదించడానికొక భారతీయ లాయరును నియమించారు.

వీడు, అనగా ఈ భారతీయుడు, వట్టి పనికిమాలిన వాడుగా వ్యవహరించి, తానుతీసుకున్న ఫీజుకు మంచి ఉపకారమే చేసిపెట్టాడు. వెనువెంటనే అతడు, భారతీయునికుండే తల పొగరుతో, థాంప్సన్‌ని బోనులో నిలబెట్టాడు. మొట్టమొదట ఆయన్నిలా ప్రశ్నించాడు:

"థాంప్సన్‌గారూ, ఆ-ఈ ప్ర-మా-దం జరిగిన తర్వాత ఏ ఆసుపత్రికైతే మీరు జోసెఫ్‌ని తీసుకెళ్ళారో, ఆ ఆసుపత్రిలో మీ భార్య చికిత్స పొందుతున్నారా?"

ఈ ప్రశ్నకు డిఫెన్స్ లాయరు అభ్యంతరం చెప్పారు. కేసుకూ, దీనికీ సంబంధం లేదన్నారు. థాంప్సనే అన్నారు: "నన్ను థాంప్సన్‌గారని పిలవకండి. 'అయ్యా' అని పిలవండి."

అప్పుడు భారతీయుడు అతి నున్నని యిగిలింపు మొగం నావైపు తిప్పి,

అన్నాడు: "ఇప్పుడే ఏలినవారికి నా అభిప్రాయ మేమిటో మనవి చేస్తాను." నే నతని ప్రశ్నకు అనుమతి ఇచ్చాను. భారతీయుడు మళ్ళీ ముద్దాయి వైపు తిరిగి, అడిగాడు: "సరే, అయ్యాగారూ, తమ భార్యగారు అప్పుడా అసుపత్రిలో రోగిగా ఉన్నారా?"

"ఆ, ఉన్నారు."

"మూత్రపిండం చెడిపోవడమనే వ్యాధితో ఆమె బాధపడుతున్నారా?"

"వైద్యశాస్త్రానికి సంబంధించిన ప్రశ్నలడగవద్దు. నేను వైద్యుణ్ణికాను."

"కాని, తమరు చెప్పినదాన్నే నేను ఉటంకిస్తున్నాను. అయ్యా, థాంప్సన్ గారూ, తమరు గత సెప్టెంబరు 17 వ తేదీ 'రొడీషియా హెరాల్డ్' పత్రికలో ఒక ప్రకటన చేస్తూ, సరిగ్గా ఆ శబ్దాన్నే ఉపయోగించారండీ! మూత్రపిండం చెడిపోవడమనే వ్యాధితో మీ భార్య బాధపడుతున్నారనీ. ఎ-బి గ్రూపుకు చెందిన రక్తం గలవారెవరైనా ఆమెకు తన మూత్రపిండ మీయవలసిందనీ తమరు ఆ ప్రకటనలో కోరారు."

నేను అంతా వింటున్నాను. ప్రతివారూ అత్యంతాసక్తితో వింటున్నారు.

"ఆ ప్రకటన యిచ్చింది డాక్టర్లు; నేను బిల్లు మాత్రమే చెల్లించాను."

"ఆ విజ్ఞప్తికి ఎవరైనా జవాబిచ్చారా?"

"వెంటనే యివ్వలేదు. కొద్దిరోజుల తర్వాత శాలిస్‌బరీ నుంచి ఒక పెద్దమనిషి వచ్చి తన మూత్రపిండాల్లో ఒకదాన్ని అమర్చుకోడానికి అనుమతించాడు."

"ఆ పెద్దమనిషి పేరు ఏమిటో కోర్టు వారికి తెలియజేయగలరా?"

"వీల్లేదు. ఆ పెద్దమనిషి తన ఊరు, పేరు చెప్పవద్దన్నాడు."

"ప్రస్తుతం విచారణ జరుగుతున్న ఘటనకు ముందురోజు తమరు జోసెఫ్ అను తమ ఇంటి కుర్రవాణ్ణి ఆసుపత్రికి తీసుకెళ్ళి, వాని రక్తం ఏ గ్రూపుకు చెందిందో పరీక్ష చేయించారా?"

"లేదు. వాడు తనంత తానే వెళ్ళి యుండవచ్చు."

"సరే. వాని రక్తం ఏ గ్రూపుకు చెందిందో తెలుసుకున్నారా? అది ఎ-బి గ్రూపుకు చెందిందేనా?"

"నాకెలా తెలుస్తుంది? నీగ్రోల రక్తపు గ్రూపులు నాకు తెలియవు."

"కాని, థాంప్సన్‌గారూ- అయ్యా- తమ భార్యకోసం ఒక మూత్రపిండాన్ని దానం చేయడానికంగీకరిస్తున్నట్లు జోసెఫ్ చేత మీరు సంతకం చేయించుకున్నారనుకుంటాను?"

"అయితే కావచ్చు కాని, నేను మీ కిదివరకే చెప్పాను- శాలిస్‌బరీ నుంచి వచ్చిన పెద్దమనిషి మమ్మల్ని కాపాడేదని."

"ఆ పెద్దమనిషి, ఏ ఫ్లూక్ వల్లనయినా, సరిగ్గా జోసెఫ్ కాల్చబడిన రోజునే వచ్చి, ఆ సాయంత్రమే తిరిగి వెళ్ళిపోయాడా?"

"ఇదిగో, మనిషీ, వెటకారం వద్దు! అతడు వచ్చిన మాట నిజమే. కాని, జోసెఫ్ కాల్చబడలేదు."

"అయితే, ఆ పెద్దమనిషి ఉదయం వచ్చి పదకొండు గంటలకుమ్మాత్ర పిండాన్ని తీయించేసుకొని, మధ్యాహ్నం రెండు గంటలకు బయల్దేరే విమానంలో శాలిస్‌బరీకి తిరిగి వెళ్ళిపోయాడన్న మాట. అంతేనాండీ?"

మళ్ళీ నన్ను వైద్యశాస్త్రానికి సంబంధించిన ప్రశ్నల్లోకి లాగవద్దు!"

"అయ్యా, యిది వైద్యశాస్త్రానికి సంబంధించిన విషయం కాదు. ఆ పెద్ద మనిషి ఆపరేషను అయిన మూడు గంటల్లో శాలిస్‌బరీకి తిరిగి వెళ్ళి పోయాడా? అని మాత్రమే అడుగుతున్నాను."

"ఔను; వెళ్ళిపోయాడు."

"తమ భార్య మాత్రం, ఆపరేషను జరిగిన పదిరోజులవరకు ఆసుపత్రిలోనే ఉన్నారనుకుంటాను?"

"ఉండియుండవచ్చు; నాకు జ్ఞాపకం లేదు."

"థాంప్సన్‌గారూ, అయ్యా, ఇప్పుడు నేను తమతో అంటున్నాను- శాలిస్‌బరీనుంచి వచ్చిన పెద్దమనిషి అంటూ ఎవరూ లేరు. జోసెఫ్ అనే పిల్లవాణ్ణి తమరు మోసగించి, తన మూత్ర పిండాన్ని కోసుకోడానికి అంగీకరిస్తున్నట్లు అతని నుంచి సంతకం తీసుకున్నారు. ఈ జోసెఫ్, తాను సంతకం చేసిన పత్రం ఎట్టి స్వభావం గలదో తెలుసుకున్న తర్వాత, తమతో కలసి ఆసుపత్రికి వెళ్ళడానికి నిరాకరించాడు. తమరు వానికి డబ్బు యివ్వబోయారు. కాని అతడు తీసుకోవడానికి నిరాకరించాడు. అప్పుడు తమరు కోపోద్రిక్తులై వానిని బెదిరించారు. జోసెఫ్ భయకంపితుడై తమనుంచి పారిపోసాగేడు. తమరు రైఫిలు తీసుకొని వాని వీపు మీద కాల్చారు. అప్పుడు తమరు, చనిపోతున్న ఆ వ్యక్తిని ఆసుపత్రికి తీసుకెళ్ళి, తమలాంటి అమానుషులే అయిన డాక్టర్ల బృందం వానిచేత మూత్ర పిండాన్ని కోయించి అతికింపచేశారు"

కోర్టులో పెద్ద అలజడి రేగింది. అక్కడి నుంచి నీగ్రోలందరినీ నేను బయటికి పంపివేయవలసి వచ్చింది. ఆ పొగరుబోతు భారతీయుణ్ణి యికమాట్లాడకుండా అపుజేశాను. ఈ అర్ధ నాగరికత జాతుల్ని కోర్టులోకి రానిస్తే, వాళ్ళు న్యాయశాస్త్ర విధుల్ని ఉల్లంఘిస్తారని నేను మొదటినుంచీ అనుమానిస్తూనే వచ్చాను. నీవు భారతీయునికి వెయ్యి సంవత్సరాలు బోధించినా, బ్రిటిష్ శాస్త్రంలోని మెళకువలు వానికి అర్థం కావు. ఒక సరళమైన కేసు జాతుల సమస్యపై అభిప్రాయాలు వెలిబుచ్చే సాధనంగాను, రాజకీయ సర్కసుగాను వక్రీకరింపబడి, అనేక అసందర్భమైన ప్రశ్నలు లేవనెత్తబడ్డాయి. అందుచేత, నేను మొత్తం విచారణను రికార్డు నుంచి తొలగించవలసిందిగా ఉత్తరువు జారీ చేయవలసి వచ్చింది.

అయితే, బ్రిటిష్ న్యాయం కలుషితం కాకుండా చూడాలని నేను నిశ్చయించు కున్నాను. థాంప్సన్‌కి కఠినమైన శిక్ష విధించాను. కోర్టు లేచేవరకు ఆయన జైలుశిక్ష అనుభవించాలి. (పత్రికలు ఈ తీర్పును విమర్శించాయి. ఈ విధమైన నేరాలు చేసే యూరపియన్లు యికముందు శిక్షింపబడకుండాపోతారని ఆక్షేపించాయి) రెండువందల పౌనులు జుల్మానా కూడ విధింపబడింది. అది మృతుని తల్లికి చెల్లించాలి.

ఆ సొమ్ము తీసుకోడానికి నీగ్రో స్త్రీ వెళ్ళలేదని తర్వాత నేను విన్నాను. ఆఫ్రికన్ల పద్ధతులు అంతు చిక్కవు!

థాంప్సన్ సతి మూత్రపిండం ఒకటి నీగ్రో జాతి వానిదని ఆమె స్నేహితు రాళ్ళు అప్పుడప్పుడు చెప్పుతూ ఉంటా రని నేను విన్నాను. కాని, అది నీగ్రో వానిదైనా, శ్వేతముఖునిదైనా, చాల చక్కగా పనిచేస్తున్నట్లే కనిపిస్తుంది.

ఇక ఆ పాడు భారతీయ లాయరు విషయం. అతడేమయాడనేది వేరే విషయం. కాని, ఒకటి మాత్రం నేను చెప్పగలను. అదేమంటే, వానికి ఏదైనా సంభవించిందో దానికతడు సర్వవిధాలా అర్హుడు!

("ఇలస్ట్రేటెడ్ వీక్లీ" సౌజన్యంతో)

ఆడపిల్ల అస్తమానం అలానవ్వకూడదనీ,
కాస్త గాంభీర్యం నేర్చుకోమని
ఎందుకలా గొంతు చించుకుంటావు-
వెళ్ళి-ఆగోడచాటు ఇల్లాళ్ళని అడిగిచూడు
మొహాలు ముడుచుకుంటున్నందుకు విసుక్కుంటూ
వాళ్ళ మొగుళ్ళు
ఆడదంటే నవ్వులపువ్వులా తుళ్ళుతూండాలని
మొత్తుకుంటూంటాడు !

# కాళరాత్రులు మూల్గుతున్న దేశం

## డాక్టర్ మిరియాల రామకృష్ణ

నాకే

మత్తుగా ఉంటుంది గమ్మత్తుగా ఉంటుంది ఈ నెత్తుటికే
మరామత్తుగా ఉంటుంది ఇన్నాళ్ళ తర్వాత ఇన్నేళ్ళ తర్వాత
మళ్ళీ నా చిన్నప్పటి వన్నెచిన్నెలను గురించి గుర్తుచేసుకుని
మనసులో గుత్తులుగా పూసిన అనుభవాలను గుచ్చికూర్చడం.

ఇప్పటి ఈ

మెరుపుతీగలకన్నా ముద్దైనది అప్పటి ఆ నెలవంక ఈ
మేడిపండు వాస్తవంకన్నా నిజమైనది ఆ ద్రాక్షపళ్ళ స్వప్నం ఈ
డిటెక్టివ్ నవలకన్నా ఎంత రసవత్తరం ఆ లిరికల్ కల! ఈ
డిలక్సు శామియానా కన్నా ఎంత బృహత్తరం ఆ చాందినీ

నేను

రేపటి నా జాతికోసం అర్పించిన చిరంతనధనం
రెడీమేడ్ దుస్తులు తొడుక్కునే వయస్సులో మనస్సుకి
రెక్కలు మొలిచి గంతులు వేస్తూ సీతాకోక చిలుకలా
చక్కదనాలతో ఆడుకున్న నా నిన్నటి చిన్నతనం!

ఆనాడు

నూనూగు మీసాల నూతన సీమల్లో నుంచొని వెనక్కు చూస్తే
నేను విన్నదేమిటి? నాకు కనిపించిందేమిటి? నా బాల్యం నుంచీ
నేనెక్కిన ఊహల ఏనుగులూ అనుభవాల గానుగులూ
గానాల తూనీగలూ స్వప్నాల హరిణాలూ కాక మరేమిటి?

గతమే కానీ ముందు

దారి నెరుగని బాల్యంపు బాటసారి తనకు తానై సొంత
దారి వెదుక్కుంటూ వెళ్ళిపోదామనుకుంటూంటే మరేదో
దారి చూపించే అమ్మా నాన్నలు, మామా తాతలు అతడ్ని
దారి మళ్ళించలేదు గదా అపాయాల ఆగ్నేయానికి.

నాకేం తెలుసు

నన్ను మెడపట్టుకు గెంటే పరిస్థితుల కాళరాత్రులు
నా దేశం నిండా మూల్గుతున్నాయని? రంగులరాట్నం
తొలిసారి చూసి నృత్యం చేస్తూ సత్యం నేస్తూ
కలలనే కప్పుకుని కవిత్వంలో తిరుగుతున్నవాడికి?

# కన్నడంలో తొలినవల

## జొనమద్ది హనుమచ్ఛాస్త్రి

ఏప్రిల్ '79 'అభ్యుదయ' సంచికలో 'దక్షిణాది భాషల్లో తొలి నవల' అనే వ్యాసంలో 1889 లోనే మొదట కన్నడ కాదంబరి (నవల) 'ఇందిరాబాయి' అన్న పేరుతో (ఇది 1899గా సవరింపబడింది. చూ. ఏప్రిల్ సంచికలో 'లేఖలు' శీర్షిక-సంపాదకుడు) ప్రచురింపబడినట్లు వ్రాశారు. కాని కన్నడములో మొదటి స్వతంత్ర సాంఘిక నవల 1899 లో శ్రీ గుల్వాడి వెంకటరావు రచించిన 'ఇందిరబాయి'కి చెల్లునని, కన్నడ సాహిత్య చరిత్ర కారులైన రం. శ్రీ ముగళిగారు పేర్కొన్నారు. (చూ. కన్నడ సాహిత్య చరిత్ర పుట 212, సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ ప్రచురణ).

కన్నడములో నవలారచన ఆంగ్ల బెంగాలి, మరాఠి, రచనల అనువాదాలతో ప్రారంభమైంది. 1895 లో వీరేశలింగంగారి 'వివేకచంద్రిక' ను బెళ్ళావె సోమనాథయ్య కన్నడం చేశారు. 1895 లోనే మద్రాసు హైకోర్టులో న్యాయవాదిగా పనిచేస్తూవుండిన రెంటాల వెంకటసుబ్బారావుగారు 'కేసరివిలాస' అనే స్వతంత్ర తెలుగు నవల రచించారని ప్రముఖ పరిశోధకులు గోవింద సాయిగారి అభిప్రాయము. రెంటాల వెంకటసుబ్బారావుగారు 'కేసరివిలాస' 'ఆనంద దీపికె' అను నవలలను తెలుగులో రచించి, వారే వాటిని కన్నడమునకు అనువదించి మద్రాసులో అచ్చు వేయించారు. ఇది చారిత్రక, సాంఘిక యితివృత్తాలతో కూడుకొన్నది, (కన్నడదల్లికాదంబరి సాహిత్య-దు. నిం. బెళలి పుట 16-కర్ణాటక విశ్వవిద్యాలయ ప్రచురణ).

కన్నడములో మొదటి డిటెక్టివ్ నవలా రచయిత, కన్నడ పత్రికోద్యమ పితామహుడైన ముదివీడు వెంకట కృష్ణయ్యగారు వారి నవల 'చోర గ్రహణతంత్ర'. ఇది 1897 లో వెలువడింది.

1898లో గళగనాథగారి మొదటి స్వతంత్ర నవల 'ప్రబుద్ధ నయనె' వాగ్భూషణ పత్రికలో ధారా వాహికంగా ప్రచురింపబడింది.

1905 లో, బోళార బాబూరావుగారి 'వాగ్దేవి' సంచలనం కల్గించింది. కుముదపురం మఠాధిపతియైన చంచల నేత్ర శ్రీ పాదులవారు, 'వాగ్దేవి' అనే యువతిని ప్రేమించి మఠం పావిత్ర్యాన్ని మట్టిపాలు చేయటమీనవలలోని యితివృత్తం.

కన్నడ నవలాకర్తలలో తొలి దశలో ప్రధానంగా పేర్కొనదగినవారు, శ్రీబోళా బాబూరావు (వాగ్దేవి) కెరూర్ వాసుదేవాచార్య (ఇందిర) ఎం. ఎస్. పుట్టణ్ణ (మాడిద్దుణ్ణో మహారాయ).

ఆధునిక కన్నడ నవలాకారులలో దేవుడు, బెటగేరి కృష్ణశర్మ, శివరామ కారంత్ (1978 జ్ఞానపీఠ ప్రశస్తి నందుకొన్న "మూకజ్జియ కనసుగళుది" రచయిత) వి. కె. గోకాక్, రం. శ్రీ ముగళి, కె. వి. పుట్టప్ప, మాస్తి వెంకటేశ అయ్యంగార్, అ. న. కృష్ణరాయ, మిర్జి అణ్ణారాయ, బసవరాజ కట్టీమని, నిరంజన, త.రా. సుబ్బారావు, గొరూరు రామస్వామి అయ్యంగార్, ఎస్. ఎల్. భైరప్ప, లంకేశ్, అనంతమూర్తి మున్నగు వారెందరో వున్నారు.

# అరసం శాఖలకు విజ్ఞప్తి

ఈనెల 8వ తేదీ సాహిత్య విమర్శకులు శ్రీతాపీ ధర్మారావుగారి వర్ధంతిని పురస్కరించుకొని సాహిత్య విమర్శ భాషోద్యమాలపై సదస్సులను-సభలను నిర్వహించాలని ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ ఏటుకూరి ప్రసాద్ విజ్ఞప్తి చేశారు.

ఈ మధ్య హైదరాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీలు సంయుక్తంగా 'తెలుగు అధికార భాషగా-బోధనా భాషగా" అను అంశంపై మూడు రోజుల సదస్సు నిర్వహించాయి. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విశ్వవిద్యాలయాల నుండి ప్రముఖులూ, ఉస్మానియా ప్రాంతంలోని అధ్యాపకులు సుమారు 100 మంది హాజరయ్యారు. అనేక విషయాలపై చర్చలు జరగటం చివరకు కొన్ని తీర్మానాల రూపం తీసుకోవడం జరిగింది. అయితే 1వ తరగతి నుండి 10వ తరగతి వరకూ విద్యార్థులకు అన్ని విషయాలలో పుస్తకాలు వ్యావహారిక భాషలోనే ఉండాలన్న అధికార తీర్మానాన్ని కొందరు గ్రాంధిక ఛాందసులు అడ్డుకున్నారు. వ్యావహారిక భాషావాదులు అధిక సంఖ్యలో దీనిని అమోదించే స్థితిలో ఉన్నా, గడబిడల మధ్య నిర్వాహకులు ఉపసంహరించుకున్నారు.

కాలం మారుతున్నా, సాంఘిక పరిస్థితులు మారుతున్నా ఈ గ్రాంధిక భాషావాదులు ఇంకా తమ కుంటికాలు అడ్డు పెడుతూనే ఉన్నారు. ఇలాంటి పరిస్థితులలో అభ్యుదయ రచయితల సంఘం ప్రజానీకంలో చైతన్యం రగిలించాలి. గ్రాంధిక వాదుల ఆట కట్టించాలి. అందుకు ముఖ్యంగా ఈ తాపీ వారి వర్ధంతిని మనం ఈ దృష్టితో జరపాలి అందుకు మనశాఖలూ, సభ్యులూ కదలటం అత్యవసరమని ప్రకటనలో శ్రీ ప్రసాద్ పేర్కొన్నారు.

# వార్తా సంగ్రహం

## పలుచోట్ల మాక్సింగోర్కీ 111 జన్మదినోత్సవాలు

మాక్సింగోర్కీ 111వ జన్మ దినోత్సవం పలు నగరాలలో అభ్యుదయ రచయితలు జరిపారు.

హైదరాబాదులో శ్రీ ఏటకూరి ప్రసాద్ అధ్యక్షతన జరిగిన సభలో శ్రీ శీలా వీర్రాజు అభ్యుదయ భావాలు వ్యక్తీకరించే కవుల జీవితం వాటికి వక్ర రూపంగ వుండరాదన్నారు. శ్రీ ఎల్లోరా ప్రజలను చేరడానికి జానపద సాహిత్యం సులభమార్గమనీ, శ్రీ శివారెడ్డి చిన్న కవితలను, పెద్ద కవితలను వేరు వేరుగా చూడరాదనీ, శ్రీ జ్వాలాముఖి వస్తువు, శిల్పం మంచివైతే కవిత ప్రజల మన స్సుల్లో చొచ్చుకపోతుందని ప్రసంగించారు.

కృష్ణాజిల్లా అరసం అధ్వర్యాన, పెద్దిబొట్ల సుబ్బరామయ్య అధ్యక్షతన జరిగిన సభలో డాక్టర్ చందు, సుబ్బారావు రచనను సోషలిస్టు వాస్తవికతకు ఒరవడి పెట్టి, భావితరాలకు విప్లవ సందేశాన్ని అందించిన గోర్కీ అమరుడు అని అన్నారు. సకల పార్శ్వాలనుంచి జీవితాన్ని తర్కించిన గోర్కీ రచనలు విప్లవ యుగానికి ప్రతీకలని అధ్యక్షుడు చెప్పగా, సామాన్యంగా కనిపించే యితివృత్తాలు కూడ గోర్కీ రచనలో ఎంతో అందచందాలను పొందాయని శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ ప్రశంసించారు శ్రీ కాట్రగడ్డ గంగయ్య, శ్రీ తుమ్మల వెంకటరామయ్య, శ్రీ మోహన్, శ్రీ సంగాల కోటేశ్వరరావు కూడ ప్రసంగించారు,

గుంటూరు జిల్లా అరసం అధ్వర్యాన, శ్రీ ఆవుల మదన్‌మోహన్ అధ్యక్షతన జరిగిన సభలో, శ్రీకుందుర్తి ఆంజనేయులు నేను కవిత్వం రాసే తొలిరోజులలో గోర్కీ, మయకొవస్కీ రచనలు ప్రభావితంచేశాయన్నారు. ఛీలి బలహీన పడిన అభ్యుదయ కవితాఉద్యమాన్ని సమైక్య పరచాలని ఆయన కోరారు. డాక్టర్ సి. రాజారాం గోర్కీ గురించి ఒక బల్గేరియన్ కవి రాసిన కవితను చదివారు.

ఖుర్దారోడ్ సాహితీ సాంస్కృతిక సంస్థ "కవిత" అధ్వర్యంలో జరిగిన సభకు "కవిత" అధ్యక్షులు శ్రీ ఆనందరావు అధ్యక్షత వహించారు. కవితా సమ్మేళనం తరవాత గోర్కీ జీవితానుభవాల గురించి, విశ్వ సాహిత్యానికి అతడొనరించిన సేవలగురించి ప్రస్తుతిస్తూ శ్రీ విజయచంద్ర, శ్రీ రామతీర్థ, శ్రీ హనుమంతరావు మాట్లా

దేరు. పిల్లల సాంస్కృతిక కార్యక్రమం, శ్రీ చంద్రారావు శ్రీ ప్రసాద్, శ్రీ నరసింహం సంగీత సారథ్యంలో పాటల కార్యక్రమం జరిగాయి.

### కొల్లూరు అరసంశాఖ వార్షికోత్సవం
### (జీవన సమరంలో అలసిపోయిన)

వారికి మానసికోల్లాసాన్ని, వికాసాన్ని కలిగించేందుకు యువ రచయితలు యత్నించాలని, ఏప్రిల్ 13న కొల్లూరు (తెనాలి తాలుకా) అరసం వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తూ శ్రీ గుత్తికొండ సీతారామయ్య కోరారు. నేటి సాహిత్యం వ్యాపారవస్తువుగా మారిపోయిందని శ్రీ డి. ఆర్. రాజ్ పాల్, జీవిత సమస్యలను పరిష్కరించుకోవలసిన బాధ్యతను రచయితలు స్వీకరించాలని శ్రీమన్నె ఉమామహేశ్వరరావు చెప్పారు. శ్రీకొలకలూరి ప్రకాశరావు అధ్యక్షుడుగా శ్రీ డి ఆర్. రాజ్ పాల్ ప్రధానకార్యదర్శిగా శ్రీ యర్రపాత్రుని హనుమంతరావు సహాయ కార్యదర్శిగా నూతన కార్యవర్గం ఎన్నుకోబడింది.

### చిన్న మాటలలో చక్కని కవిత్వం

అతి చిన్న మాటలలో అతి చక్కని కవిత్వం రచించడంలో ఉర్దూ కవులు విశిష్టులని, విజయవాడ అరసం శాఖ అధ్వర్యాన ఏప్రిల్ 6న జరిగిన సాహితీ గోష్ఠిలో శ్రీమతి లత చెవుతూ, మఖ్దుం గాలిబ్ రచనలు ఉదాహరించారు. శ్రీ పి. సి. సి. జోషి సభకు అధ్యక్షతవహించారు. నేటిరచనా విధానంలోని అవాస్తవికతను విమర్శించి, శ్రీమతి లత సామాజిక పరిశీలన, అవగాహన లేనందున కాలక్షేప రచనలు వస్తున్నాయని అన్నారు. శ్రీ తుమ్మల వెంకటరామయ్య, శ్రీ సంగాల కోటీశ్వరరావు కూడా ప్రసంగించారు.

### వేములవాడలో సాహిత్యోత్సవం

నటరాజ కళానికేతన్ (వేములవాడ) తృతీయ వార్షికోత్సవం ఏప్రిల్ 13, 14, 15 తేదీలలో ఘనంగా జరిగింది. శీలా వీర్రాజు, సురమౌళి, ఏటుకూరి ప్రసాద్, జ్వాలాముఖి, మున్నగు ప్రముఖ రచయితలు పాల్గొన్నారు. శ్రీ చొప్పకట్ల చంద్రమౌళికి సన్మానం జరిగింది. 'ఉదయరేఖలు' అన్న కవితా సంకలనం ఏటుకూరి ప్రసాద్ ఆవిష్కరించారు. వార్షికసంచిక నవ తను జ్వాలాముఖి ఆవిష్కరించాడు. శ్రీ శీలావీర్రాజు గారి చిత్రకళా ప్రదర్శన ఈ సందర్భంగా ఏర్పరార్చారు.

### మణుగూరు కాలరీ అరసం శాఖ

ఉగాదినాడు మణుగూర్ కాలరీ ప్రాంతం అరసం శాఖ ప్రారంభింపబడింది. ఈ సందర్భంగా కవి సమ్మేళనం జరిగింది. కార్యదర్శిగా శ్రీ ఆవుల కనకయ్య, సంయుక్త కార్యదర్శిగా శ్రీ సలీం ఎన్నికయ్యారు.

మినికాయ్ దీవి ప్రజల జీవిత సరళి.

**అభ్యుదయ రచయితల సంఘం**

మద్రాసు శాఖ ఆధ్వర్యాన ఏప్రియల్ 1వ తేదీన పొట్టి శ్రీరాములు మెమోరియల్ హాల్‌లో జరిగిన సాహిత్యగోష్ఠిలో, మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆంథ్రోపాలజీ లెక్చరరు శ్రీ వరఖల సుదర్శన్ 'మినికాయ్' దీవిలో తాము జరిపిన మానవశాస్త్ర పరిశీలనా విశేషాలు వివరిస్తూ ప్రసంగించారు. ఆ దీవుల ప్రజలలో కనిపించే నాలుగు తరగతులను వర్గాలుగాగాని, వర్ణాలుగా గాని పేర్కొ-వచ్చునా అన్న అంశంపై చర్చలో సభ్యులందరూ పాల్గొన్నారు. మాతృస్వామిక సమాజ వ్యవస్థా, సామూహిక ఆస్తి సంబంధాలు గల సమాజంలో వ్యక్తి స్వత్వం గల ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టేందుకు ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలూ, బయటి ప్రపంచంతో సంబంధాలవల్ల అక్కడి ఆచారాలూ, అలవాట్లలో వస్తున్న మార్పులు గురించి సభ్యుల ప్రశ్నలకు శ్రీ సుదర్శన్ సమాధానాలిచ్చారు.

**వీరేశలింగం వర్ధంతి**

మద్రాసు కళాసాగర్ ఆధ్వర్యాన ఏప్రిల్ 16వ తేదీన శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ అధ్యక్షతన వీరేశలింగం 121వ వర్ధంతి సభ జరిగింది. అధ్యక్షుడు మాట్లాడుతూ సుబ్రహ్మణ్య భారతి, రాజాజీ మొదలయిన తమిళ మేధావులకు వీరేశలింగంపట్ల వుండిన గౌరవప్రపత్తులను వారి రచనలనుంచి వుదాహరిస్తూ ప్రసంగించారు.

తరవాత శ్రీ ధారా రామనాథ శాస్త్రి సోదరుల నాట్యావధాన ప్రదర్శనం జరిగింది.

ఈ నాటి సమాజంలో ప్రబలి వున్న సాంఘిక దురాచారాలను నేటి వీరేశలింగం ఎలా పరిష్కరించగలడు? విషయంపైన కళాసాగర్ వ్యాస రచన పోటీని ప్రకటించారు

## కథల పోటీ గడువు పొడిగింపు

అనేకమంది ఔత్సాహిక రచయితల, రచయిత్రుల కోరికపైన "నవయువత కథల పోటీ"ని మే 31వ తేదీవరకు పొడిగించడం జరిగిందని నిర్వాహకులు ఒక ప్రకటనలో తెలిపారు.

కథలను హామీ పత్రంతో, జతపరచి. 25 పైసల స్టాంపు 'నవయువత' స్టేషన్ పేట. నర్సాపురం 534275, ప. గో. జిల్లాకు పంపాలని కోరారు.

# సోషలిస్ట్ వాస్తవికతా పితామహుడు

# "మాగ్జిం గోర్కి"

రచన : చేకూరి శ్రీనివాసరావు

1917లో రష్యాలో వచ్చిన సోషలిస్ట్ విప్లవం ప్రపంచాన్ని పూర్తిగా కదిలించి కొన్ని మౌలికమైన మార్పుల్ని తెచ్చింది. ప్రపంచాన్ని గురించీ, జీవితాన్ని గురించీ, చరిత్ర గురించీ సాధారణ మానవుని కున్న అవగాహనను అది పూర్తిగా మార్చి వేసింది. నూతన మానవుడు సృష్టించ బడ్డాడు. నూతన కళా రీతులు, నూతన విలువలు సృష్టించ బడ్డాయి. అట్టి కళారీతులలో ఆధునిక సాహితీ లోకంలో ధృవతారగా వెలుగొందు తున్నది-'సోషలిస్టు వాస్తవికత'. సోషలిస్ట్ వాస్తవికత ద్వారా సాధారణ మానవుణ్ణి – మహోన్నతునిగా మంచి, స్వేచ్ఛకోసం పోరాడటంలో ఉన్న ఆనందాన్ని- గొప్పతనాన్ని అతనికి సుస్పష్టంగా విడమరచి, ప్రపంచ పోకడకు ఉన్నతత్వాన్ని, నూతనత్వాన్ని ఆపాదించిన వ్యక్తి, మహారచయిత - మాగ్జింగోర్కి.

1868 లో పుట్టిన మాగ్జింగోర్కి అసలు పేరు – అలెగ్జీ మాగ్జిమోవిచ్ పెష్కోవ్. చిన్ననాడే తండ్రి మరణించి నందున తాత దగ్గర పెరిగాడు. కుటుంబం పేదదైనందున గోర్కి చిన్నప్పుడే జీవనోపాధి కోసం హోటల్‌లో సర్వర్‌గా పనిచేశాడు. శ్రమ జీవనంలో ఉన్న గొప్పతనాన్ని అతనాకాలంలోనే అవగాహన చేసుకోగలిగాడు. బ్రతుకు దెరువు కోసం దేశంలోని పలుప్రాంతాల్లో తిరగటం వలన జనజీవితాల్లోని వైరుధ్యాలు, వైవిధ్యాలు అర్థం చేసుకోగలిగాడు.

రష్యాలో లెనినిస్ట్ పార్టీ పుట్టిన తొలిరోజుల్లో గోర్కి తన రచనా వ్యాసంగాన్ని అరంభించాడు. దేశంలోని శ్రామికులు, కర్షకులు నూతన ప్రపంచావిష్కరణకోసం కలలు కంటూ ఉద్యమిస్తున్న రోజులవి. గోర్కి తన రచనల్లో తనేజనంతో కలిసి తిరిగాడో, ఆ అట్టడుగు జన జీవితాన్నే చిత్రించాడు. ఆయన చిత్రించిన పాత్రలు – పాత్రల్ని నిలిపి, కుదిపి తమ జీవిత లక్ష్యాన్ని ప్రశ్నించుకొనేలా ఉంటాయి.

ఆనాడు (1902) రష్యాలో జారు ప్రభుత్వపు నియంతృత్వ విధానాలతో అలసి పోయిన రష్యా జన హృదయ స్పందనను ప్రతిబింబించిన నాటకం - "ది లోయర్ డెప్త్స్" (The Lower Depths) ప్రపంచ నాటక రంగానికే ఒక కొత్త ఊపిరి నిచ్చింది. ప్రతి దేశంలోను పలు ప్రదర్శనలిచ్చిన నాటకం యిది. ఈ నాటకంలో జారిస్టు ప్రభుత్వ పోకడపై ప్రత్యక్షంగా నిరసన తెలియజేయక పోయినా, నాటకం లోని పాత్రలు - కార్మికులు, దగాపడిన దొంగలు, వేశ్యలు - తమ దీనస్థితికి విలపిస్తూ 'ఈ నియంతృత్వ వ్యవస్థ యికెంత మాత్రమూ సాగటానికి వీల్లేద'నే వారి హృదయ తపనతో కన్పిస్తాయి. అందుకే ఆనాటి ప్రభుత్వం ఆ నాటకాన్ని నిషేధించింది.

1906 లో గోర్కీ అమెరికా వెళ్ళినపుడు రాసిన నవల 'అమ్మ' (Mother). ఇది రష్యా సాహితీ లోకంలోనే గాక ప్రపంచ కార్మిక లోకంలోనే ఒక సమున్నత స్థానాన్ని పొంది, అనేక భాషల్లో అనేక ముద్రణలు పొందిన నవల. ఆ రోజుల్లో రష్యన్ కార్మికులు సల్పిన వర్గపోరాటాన్ని యథాతథంగా చిత్రించిన ఈ నవల, ప్రథమంగా 1906-07 లో 'యాపిల్‌టన్ మాగ్జైన్' అను ఇంగ్లీషు పత్రికలో ప్రచురింప బడింది. లండన్ లో జరిగిన రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ - ఐదవ మహాసభ సందర్భంలో లెనిన్ 'అమ్మ' వ్రాత ప్రతిని చదివి 'సమయానుకూలమైన గ్రంథం'గా అభివర్ణిస్తూ, గోర్కీని అభినందించాడు.

ప్లెఖనోవ్ అను ప్రఖ్యాత రష్యన్ సాహితీ విమర్శకుడు "అమ్మ" నవలను "విప్లవానికి అమ్మ"గా అభిభాషించాడు.

1926 ప్రాంతంలో గోర్కీ తన చివరి దశలో నాలుగు భాగాలుగా రాసిన నవల "ది లైఫ్ ఆఫ్ క్లింసంగిన్" (The Life of Klimsamgin) లో 1880 - 1917 మధ్య రష్యా జన జీవన చిత్రణ మహోన్నతంగా చిత్రించ బడింది. ఈ నవలలో ముఖ్యపాత్ర అయిన "క్లిమిసింగిన్"-ఆనాడు ప్రజలలోని కొందరు ప్రజా ద్రోహులకు ప్రతీక. పేదవారి పక్షంగా మాట్లాడు తున్నట్టు కన్పిస్తూ తన స్వార్థంకోసం ఎంతటి నీచత్వానికైనా తలపడే కుటిలత్వం నిండిన పాత్ర "క్లిమ్‌సింగిన్". ఆ తరహా వ్యక్తుల ద్వారా సమాజానికి కలిగే కీడు ఎంత భయంకరమైనదో సహజంగా చిత్రించాడు.

గోర్కీ రాజకీయంగా అవగాహన ఉన్న సాహితీ స్రష్ట. అందుకు ఉదాహరణగా క్లిమ్‌సింగిన్ రాసిన రోజుల్లో "ప్రావ్దా", "ఇజ్వెస్తియా" పత్రికలలో రాజకీయ పరమైన అనేక వ్యాసాలు ప్రచురించాడు. వాటిలో చెప్పుకోదగినవి 1. "ఝిఫ్ ద ఎనిమీ విల్ నాట్ కాపిచ్యులేట్, హిమస్ట్ బి

డిస్ట్రాయిడ్". 2. హూజ్ సైడ్ ఆర్ యు ఆన్, మాస్టర్స్ ఆఫ్ కల్చర్"? (1930), 3. ది ఆన్సర్ టు అమెరికన్ కరస్పాండెంట్" (1932).

అక్టోబరు సోషలిస్ట్ విప్లవానికి ముందు గోర్కీ రచనలకు ఆ తర్వాత రచనలకు గల భేదాన్ని చూసినట్లయితే, సామాజిక స్పృహగల రచయిత బాధ్యత ఏదో స్పష్టమౌతుంది. విప్లవానికి ముందు రష్యన్లను పురికొల్పుతూ సాగిన రచనలు, ఆ తరువాత విప్లవ ఫలితాలను కీర్తిస్తూ ఆ విప్లవ మూర్తులను అభినందిస్తూ అతడనేక రచనలు చేశాడు. గోర్కీ శ్రామిక యుగంలో గొప్ప రచయిత.

విప్లవానికి ముందు రష్యన్ సాహితీ లోకంలో ధృవతారలుగా భావించబడిన టాల్‌స్టాయ్, దాస్తొవస్కీ భావాలతో గోర్కీకి సరిపడేది గాదు. వారిద్దరూ మానవుణ్ణి మహోన్నతునిగా చిత్రిస్తూ ఎదుటి వ్యక్తికి లొంగి బతకటంలో మానవుని ఔన్నత్యం పెరుగుతుందని భావిస్తే, గోర్కీ-'మానవుడు' అనే శబ్దంలోని మహోన్నతకు అనువుగా బతికిన వాడే నిజమైన మానవుడని ఉద్బోధించాడు.

ఇతర అనేక మంది రచయితల్లా గోర్కీ సమకాలీన ప్రజాజీవితాన్ని చిత్రించడం మాత్రమే గాక, తద్వారా బయల్పడే భవిష్యత్ సమాజ నిర్మాయక పరిస్థితుల్ని చిత్రించాడు. గోర్కీ నిజమైన సోషలిస్ట్ రచయిత.

ఫాసిజమ్ యొక్క ప్రమాదాన్ని గుర్తించి నిష్కర్షగా, దానిని వ్యతిరేకించిన తొలి సాహితీ స్రష్ట-గోర్కీ.

రష్యన్ సాహిత్యంలో అభ్యుదయ భావాలను సమ్మిళితంచేసి ఉద్దీపింప చేయటానికి - జనం నుండి, శ్రామిక జన ఉద్యమాలనుండి, లెనిన్ నుండి గోర్కీ పొందిన ప్రేరణ అమూల్యమైనది. పుష్కిన్ తరువాత అతనికంటే ఎక్కువగా జీవితం మీద మమకారం, ఆశావాదం ఉన్న రచయిత గోర్కీ. పరిణామ క్రమంలో రష్యాలో సోషలిస్ట్ పునర్నిర్మాణము తప్పదనే చారిత్రక సత్యాన్ని గుర్తించి సోషలిస్ట్ వాస్తవికతతో కూడిన నూతన సాహిత్యానికి ఒరవడి పెట్టి సోషలిస్ట్ వాస్తవికతకు పితామహునిగా గౌరవాన్ని పొందిన ధన్యజీవి - మాగ్జింగోర్కీ.

'ల్యూనాచార్‌స్కీ' అను సుప్రసిద్ధ సాహితీ విమర్శకుడు - కళకు నిబద్ధత లేనప్పుడు ప్రయోజనముండదని గ్రహించాడు. సాహిత్యంలో ఈ నిబద్ధత మరింత హెచ్చుగా అవసరం. 'సోషలిస్ట్ వాస్తవికత' అనేది కమ్యూనిస్ట్ భావాలతో కూడిన ఒక నిబద్ధ కళారీతి. అందుకే "ఉదాసీనతకు తావు లేదు; కళాకారులారా! మీరేవైపు?" అని సూటిగా ప్రశ్నించిన మేధావి, మహోన్నతుడు - మాగ్జింగోర్కీ.

# అంతరిస్తున్న అర్హతలు

ఎమ్వీ. రమేశ్

అజ్ఞానులు అందలం ఎక్కుతూ ఉంటే
విజ్ఞానులు విచారిస్తున్నారు
మూర్ఖులు మన్ననలందుకుంటూ ఉంటే
మహాత్ములు మన్ను గరుస్తున్నారు
నోట్లతో ఓట్లుకొని
ప్రజాభక్షకులు ప్రజాపాలకులైతే
మనుషులలో మంచిని పెంచే
ప్రజా సేవకులు పస్తులుంటున్నారు
నిరక్షరాస్యులు నాయకులైతే
విద్యా వేత్తలు బానిస లౌతున్నారు
అవకాశ వాదులూ – స్వార్థపరులూ
లక్షాధికారులై లక్షణంగా బతుకుతూ ఉంటే
ఆదర్శవాదులూ నిస్వార్థపరులూ
నిరాశా నిస్పృహలతోని నిస్సహాయులు.
ఇది ఈ నాటిలోకం
మంచిని అర్హతగా గుర్తించని నరకం.

---

కవీ, రచయితా రచన చెయ్యడం, పఠితలకు ఆనందమూ, జ్ఞానమూ కలిగించడానికి, తన్మూలంగ పఠితలకున్నత భావాలబ్బి సభ్యత అలవడ్డానికి. సమిష్టి మీద జాతి దృఢపడ్డానికి.

పండితుడు విమర్శ చేయడం, రచనలోవున్న మంచీ చెడ్డా లోకానికి వివరించి చెప్పడానికి తన్మూలంగ, ఆ రచనయెడల పఠితల కాదరభావమో ఏవగింపో కలిగించడానికి, చివరికి జాతికి ప్రలోభజనకమైన శీలం రూపు కట్టడానికి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# అలారం

ఏ. సూర్యప్రకాశ్

నిన్నీ వ్యవస్థ ఇంకా
జోకొడుతుంది కాని

నిద్ర లేపదు
నువ్వు నిద్రపోతున్నంత కాలం
ఇది ఇలానే అస్తవ్యస్తంగా వుండిపోతుంది
అలారం పాదని టైంపీస్‌ను నమ్ముకొని
ఇంకా నిద్రపోతున్నావా ?
నీ గుండె అలారం పాడి
నిన్ను నిద్ర లేపాలి !

---

"అదీనీ కాక మనదేశంలో అనాదిగా క్షత్రియులు రాజర్షులనిపించుకున్నారు రజస్వలా వివాహమే జరిగించినట్లు తెలుస్తుంది. వాళ్లందరు నరకానికి వెళ్లే మనంమాత్రం మోక్షానికి వెడతామా అని నా ఊహ. సీతాదేవికి వివాహం నాటికి పదేళ్లు దాటనేలేదనిన్నీ, ద్రౌపదికింకా అప్పటికి, అనగా స్వయంవరం నాటికి అయిదేళ్లు నిండలేదనిన్నీ సమర్థించే వారితో వాదించడానికి నాకు ఓపిక లేదుగాని, నేనుమాత్రం మూఢనమ్మకం మీద ఆ వివాహాలన్నీ రజస్వలా వివాహాలే అని నమ్ముతాను" ...

(వెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి 'కథలూ గాథలూ' నుంచి)

# మానవుడు

పువ్వాడ కృష్ణమోహన్

విశ్వం తలుపులు మూసుకుని
గాఢ నిద్రపోతున్న బ్రహ్మను
తట్టిలేపింది — నేను!
వానరుణ్ణి నరుడిగా ఎదిగి
రోదసిలోనికి దూసుక పోతున్నాను!

మానవత్వానికి మసిబూసి
మారేడు కాయ చేస్తున్న
గారడీ వాణ్ణి కూడా — నేనే!
విశ్వం ప్రిజంలోనికి నా కాంతుల్ని పంపి
'విబ్జియార్' సృష్టిస్తున్నాను!

తత్వ బోధతో ప్రపంచాన్ని
తట్టి లేపుతున్న సోక్రటీస్‌కు
విషమిచ్చింది కూడా — నేనే!
ఆహారంకోసం కాననాలలో నాడు
అధికారం కోసం జనపదాలలో నేడు
వ్యూహాలు పన్నుతున్నాను!
నా పేరు మానవుడు! — నా ఫార్ములా
దేవుడు + దానవుడు.

# జానపద కళారూపాలతో జనం మధ్యకు పోతున్న ప్రజా నాట్యమండలి

జనం తమ సమస్యల భయం కతత్వం తెలుసుకున్న నాడు చైతన్యంతో రెచ్చిపోయి కార్యరంగంలో దూకుతుంది. అయితే దాన్ని సాధించేదెవరు ? ఎలా ? అందుకే ప్రజా నాట్యమండలి ఈ బాధ్యతను గుర్తించింది.

ఈ మధ్య జరిగిన రాష్ట్ర సమితి ఈ దిశగా అనేక నిర్దిష్టమైన కార్యక్రమాలను రూపొందించింది. జానపద కళారూపాలలో శిక్షణా శిబిరం రాయలసీమ ప్రాంతంలో మేనెలలో నిర్వహించబోతోంది. తెలంగాణా జిల్లాల్లో బహుళ ప్రచారంలో ఉన్న అనేకమైన ప్రాచీన కళారూపాలకు అనువైన వస్తువుతో రాయించి నిత్యనూతనంగా దళాలకు తరిఫీదివ్వాలని భావించింది. ఆయా జిల్లాదళాలకు ఆదర్శప్రాయంగా ఉండే రాష్ట్రదళాన్ని మూడు మాసాల్లో తయారుచేసి ఒక నాటకం ప్రదర్శన యోగ్యతకు సిద్ధం చెయ్యటానికి ఒక ఉపసంఘాన్ని నియమించింది.

మద్రాసు ప్రజా నాట్యమండలి శాఖ నిర్మాణాన్ని పటిష్టంచేసి దాని కార్యక్రమాలకు తోడ్పడాలని భావించింది.

తిరిగి నవ జాగృతితో జనం ముందుకు వెళ్ళటానికి రాష్ట్ర ప్రజా నాట్యమండలి తన భవిష్యత్ కార్యక్రమాన్ని రూపొందించుకొంది.

## శ్రద్ధాంజలి

### చలం అబ్బూరి రంగనేని సుబ్రహ్మణ్యం గారల

మరణాలకు అభ్యుదయ సంతాపం తెల్పుతోంది.




# నగ్నముని విలోమ కథలు

విముక్తి ప్రచురణలు
M. S. 87 మలక్‌పేట హైదరాబాదు.
వెల రూ. 5/-.

భారతదేశానికి అత్యవసర పరిస్థితి గ్రహణం పట్టిన దశలో అనేకులు పలు విధాలుగా బాధలకు గురయ్యారు. అయితే సాహిత్యానికి మాత్రం వాసి ఎలాగున్నా రాసి విషయకంగా పెరుగుదల వచ్చింది. అలా వచ్చిన వాటిలో నగ్నముని రాసిన ఈ విలోమకథల సంపుటి ఒకటి. దీల్లో 4 చిన్న కథలూ 2 పెద్ద కథలూ ఉన్నాయి. ఇవన్నీ గతంలో 'ప్రజాతంత్ర' వారపత్రికలో ప్రచురితమయినవే!

రచయితే చెప్పినట్లు ఆ కాలంలో మనుషులు మనుషులుగా బతకటం మానేసి భయం భయంగా బతుకు లెక్క మార్చారు. అధికారమంత్రజులంతాగి వాళ్ళుపోయిన పోకిళ్ళకూ-చేసిన చేతలకూ-కూసిన కూతలకూ హద్దూ అపూ లేకుండటం చూసి ఇలా విలోమ ప్రక్రియలో కథలురాశాట్ట.

ఇలాటి ప్రక్రియ మనకుగాని - ప్రపంచ సాహిత్యానికిగానీ కొత్త కాకున్నా ప్రస్తుతానికి "నవ్యత్వాన్ని" సంతరించుకుందనే అనాలి. ప్రతికథలోనూ వ్యంగ్యం ఉంది. రచయిత కవి కనక రచన చాలా చోట్ల వచన కవితలా సాగింది.

"ఇందుమూలంగా...." అన్న కథలో గోముఖవ్యాఘ్రాలను చక్కగా చెప్పారు. 'సిమెంటు సంతతి' అన్ని కథల్లోకి మంచిదనచ్చు. రాజకీయ దొంగ నాయకులు దిగజారుడు విధానాన్ని బిచ్చగత్తెతో ముడిపెట్టి భావి సంతతి మీద ప్రశ్నార్థకం వదిలారు. రచయితకు పేరు తెచ్చిన కథ "లైలా మజ్నూ ప్రళయ గాథ"-రాజకీయ వ్యంగ్యంతో కూడి ఉంది. మధ్య తరగతి కుటుంబరావుల జీవితాలకు అద్దంపట్టి రానున్న తరం ఎలా పుట్టుకమీద తిరుగుబాటు చేయచ్చో "శిశుహత్య" వివరిస్తుంది. కుల మతాల దౌర్భాగ్యపు నీడల చీడలను విమర్శించేదీ ఇదే కథ.

ప్రతీకవాదం పరాకాష్ఠ నంటి పాఠకులను తేలిగ్గా గందరగోళపు అడవిలోకి నెట్టేసే పెద్దకథ 'గ్రహణం'.

ఈ విలోమ ప్రక్రియ కేవలం ప్రక్రియకోసం కాదన్న రచయిత "తన మాటకు కట్టుబడి ఉంటే" దీన్ని చదివి ఆనందించవచ్చు. కాని నాడు రీతివాదాన్ని తిరస్కరించినట్టు దీన్ని తోసిరాజనాలి.

# ఉదయరేఖలు

కవితాసంకలనం
వెల : 2 రూ.
ప్రచురణ :
నటరాజ కళానికేతన్ జిల్లెళ్ళశాఖ
కరీంనగర్ జిల్లా

శ్రీ తిరుమల నరసింహాచార్య శ్రీ పోరండ్ల మురళీధర్ కవితలు ఇందులో ఉన్నాయి. సమాజం మార్పుకు శ్రామికశక్తి సమైక్యంగా కదలాలన్న సామాజిక చైతన్యభావన ఉందీకవితల్లో. "అలము కొన్న అజ్ఞానం అంతరింప చెయ్యరా సమసమాజ భవనమందు దీప్తులు వెలిగించరా" అంటారు శ్రీ తిరుమలాచార్యులు. వీరి రచనల్లో భావకవిత్వఛాయల్లో నడిచిన 'నిరీక్షణ' లాంటివీఉన్నాయి. "మారుమోగే తప్పనిమార్పు వస్తున్నది కలలా గాక నిజం రూపుదిద్దు కుంటున్నది" అన్న సామాజిక వాస్తవికతవైపు దృష్టి సారించమన్న రచనలూ ఉన్నాయి. భావాలు ఇంకా స్పష్టమైన రూపుదిద్దు కోవలసివుంది.

శ్రీ పోరండ్ల మురళీధర్ "చైత్ర మాసపు స్టేషన్ నుండి చైతన్యపు రైలు నెక్కి" వసంతం బయల్దేరిందంటారు. "సామ్యవాదం భావాలను మస్తిష్కంలో పెంచుకొని తెలుగు నేలలో వెలుగుల అలుగులా" వసంతం వచ్చిందని చూడమంటారు. ఆదర్శాల ఉపన్యాసాగాళ్ళ "ఘరానా గుండాల గుండెలను గీతిశూలంతో ఆపరేషన్ చేయాలనుంద"ని అంటూ "దగాకోరు బడాఖాయిల వేయి నాలుకలను నా పదునైన నిజాయితీ చురకత్తితో నరికివేస్తా" నంటారు.

కార్మిక వర్గ చైతన్యం మీద గట్టినమ్మకమున్నట్టు కనబడ్తూనే ఈ కవి ఒకచోట 'బోనస్సు డీఏలు పెంచు బోగస్ చట్టాంజూపి మాయచేసి కార్మికులను మనసు గాయపరచవద్దు" అంటూ వారి ఆర్థిక పోరాటాలయెడ నిస్పృహ ప్రకటిస్తారు.

వీరిద్దరూ, సామాజిక అవగాహన మరింత పెంచుకొని నిశితమైన పరిశీలనతో సమస్యలను అధ్యయనం చేయవలసివుంది.

# నవత

నటరాజ కళానికేతన్, వేములవాడ.

కరీంనగర్ జిల్లాలో 1976 నుండీ సాహిత్యంలోనూ, సాంస్కృతికంగానూ పనిచేస్తున్న సంస్థ నటరాజ కళానికేతన్. దీనికి ఆ జిల్లాలో వేములవాడ, జిల్లెళ్ళ, ఎల్లారెడ్డిపేట,కరీంనగరంలలో శాఖలున్నాయి. ఇవన్నీ తమ సభ్యుల రచనలు పుస్తకరూపంలో ప్రకటిస్తూంటాయి.

"నవత" వారి తృతీయ వార్షికోత్సవం సందర్భంగా వెలువరించిన సంచిక. దీన్లో 24 కవితలున్నాయి. ఈనాటి సమాజం "అవినీతి అక్రమాలకు ఆలవాలమైం" దనీ, దీనికి "చితిపేర్చి—

నిప్పుపెట్టాల"ని చెప్పిన స్పృహకల్గిన రచయితలిందులో ఉన్నారు. కవులందరూ తమ భావాలను సూటిగా ఈ వెలుగా వదిలారు. అగ్గిపుల్లకు దేన్ని తగలెయ్యాలో తెలీదంటూ, అలా తెలిసింది. "అవినీతిపై మందేగుండెకే" నంటాడు జింబో. నిన్నలోనుండి వచ్చే రేపు "జనంలా ప్రాణప్రభంజనంలా అందరికీ ప్రయోజనంలా రూపుదిద్దుకుంటుందం" టాడు శ్రీధర్. చీకటికి చితిమంటలు పేర్చటం చెదురుమదురైన "ఎండుటాకులన్నీ కలిసి నిప్పురాజుకుంటూ" ఉండటంలో కృషి చేయ్యాలన్న వఝలశివకుమార్ రాజకీయభావన చాలా కవితాత్మకంగా ఉంది.

జనం కళ్ళలో శక్తి ఎంతదో చెప్తూ 'దొర'లో "ఊరినుంచి తరిమి కొడితే నీ బతుకంతా పల్లేర్లే ఖబర్దార్ అవి దొరతనాన్ని మొత్తంగా హెచ్చరిస్తాడు అలిశెట్టి ప్రభాకర్.

చాలా స్పష్టమైన అవగాహన కల్గి సొంత గొంతులతో సమాజంపై కలమెత్తిన ఈ కవులకు వెనక సూత్రధారి శ్రీ చొప్పకట్ల చంద్రమౌళి అభినందనీయులు. శ్రీ శీలావీర్రాజు ముఖపత్ర రచన మరింత అందాన్ని 'నవత'కు అందించింది.



నన్నూ, నా స్నేహితుల జీవితాన్ని మార్చిన మహావ్యక్తి, డా॥ఉప్పల లక్ష్మణరావు గారి జీవిత సంగ్రహాన్ని 'అభ్యుదయ' సంచికలో ప్రచురించినందుకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

సాహితీ సదస్సులు, ఎకాడమీలు జ్ఞానపీఠాల కొలతబద్దలకు మించిన సాహితీ వ్యక్తిత్వం ఆయనది. ఆయన జ్ఞానం అపారం. ప్రపంచ విజ్ఞాన సర్వస్వం ఆయన స్వంతం. ఆయనతో పరిచయం ప్రపంచంతో పరిచయం. సోషలిస్టు భావాల వ్యాప్తికై తన జీవితాన్నే అంకితంచేసి ఇప్పటికీ ఆ కృషిలోనే అహరహం పరిశ్రమిస్తున్న ఈ మహారచయితను ఎనభై ఏళ్ళ తరువాత ఈనాటికైనా ఆంధ్రదేశం గుర్తించినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను.

**విజయచంద్ర**
ఖుర్ధారోడ్

ఏప్రిల్ సంచికలో గిడుగువారి మీద రాసిన వ్యాసంలో పోరంకి దక్షిణామూర్తిగారు కొన్ని పదాలు వాడేరు. అవి: - "వాపోయేరు; ఉద్బోధించేరు; తులనాత్మక; బహుముఖ పాండిత్యం; నవశకోదయానికి; భాషోద్యమ కర్త; పదబంధాలు; సత్యనిష్ఠ మైందని; ప్రధానోపకరణం,.........".

పై రాసిన దానిని బట్టి చూస్తే గిడుగువారు 'వ్యావహారిక భాష' కోసం కృషిచేసేరు కాని 'మాట్లాడుకునే భాష' కోసం కాదు అనిపిస్తుంది. మాట్లాడుకునే భాషకి ప్రజలంతా పితామహులు, మాతామహులు. కనుక దానికోసం ఎవ్వరూ కృషిచెయ్యరు అని అనిపిస్తుంది.

**నిష్టల వెంకటరావు**
విజయనగరం

# RUSSIAN CLASSICAL SERIES

| S. No. | Title | Author | Price |
|---|---|---|---|
| 1. | Anna Kerenina - I & II | *Leo Tolstoi* | 23-00 |
| 2. | Resurrection | *Leo Tolstoi* | 12-00 |
| 3. | The Insulted and Humiliated | *Fyodor Dostoyevsky* | 8-50 |
| 4. | Fathers and Sons | *Ivan Turganev* | 7-00 |
| 5. | The Mis Adventures of the New Satuan | *Anton Tammasaare* | 7-50 |
| 6. | The Same Old Story | *Ivon Goncharov* | 8-00 |
| 7. | Asya-First Love Spring Torrenet | *Turganev* | 6-00 |
| 8. | The Enchanted Wonderer and Other Stories | *Nikolai Leskov* | 7-20 |
| 9. | Idiot - I & II | *Fyodor Dostovsky* | 15-00 |
| 10. | Stories | *Fyodor Dostovsky* | 8-00 |
| 11. | Selected Works - I & II | *Alexander Pushkin* | 10-00 |
| 12. | The Golovlyovs | *M Saltykon-Shchdrin* | 5-50 |



ఈనాడు అత్యంతఅభ్యు దయకరం అయిన ప్రజోద్యమాలతో, ముఖ్యంగా శ్రామిక జన సమరాలతో, వారి ఆదర్శాలతో గాఢంగా ముడిపడినప్పుడే కవితలకు, కళలకు సార్థకత.

Edited, Printed and Published by T. Venkataramiah, Printed at Nagarjuna Printing Works
3-6-737/3, Himayatnagar, Hyderabad - 500 029.